బాలానంద

# కాశీరామేశ్వర మజిలీ కధలు






నాగశ్రీ

**నవరత్న బుక్ సెంటర్**

**ఏలూరు రోడ్ ........................ విజయవాడ-2**

కాపీరైట్   ముద్రణ : 1993   వెల : 15-00

# విషయసూచిక

# కాశీరామేశ్వర మజిలీ కథలు

## సదానంద యోగి

మన భారతదేశం మొదటినుండి ఉత్తర భారతమని దక్షిణ భారతమని చెప్పబడుతూంది. రెండు దేశాలలోనూ పుణ్యనదులు, పుణ్యక్షేత్రములు కూడ లెక్కకు మించి యున్నవి. ఉత్తర భారతదేశంలో కాశీవిశాలాక్షి సమేతవిశ్వనాథ స్వామి వున్నాడు. దక్షిణ భారతదేశంలో శ్రీరామునిచే ప్రతిష్ట చేయబడిన రామ లింగేశ్వరస్వామి వున్నాడు. కాశీరామేశ్వరుల పేరులు వినని వారుండరు.

పూర్వకాలంలో మునులు మహాభక్తులు వారి వారి పరివారాలను వెంట బెట్టుకొని కాశీ నుండి రామేశ్వరానికి - రామేశ్వరం నుండి కాశీకి ప్రయాణాలు చేసేవారు. వానిని కాశీ రామేశ్వర యాత్రలంటారు. ఒకదాని కొకటి యెంతో దూరం కనుక దారిలో యాత్రికులు మజిలీ చేసేవారు. వానిని గురించి మనమిప్పుడు "కాశీ రామేశ్వర మజిలీల కథ"లని చెప్పుకుంటున్నాం.

చాలాకాలం క్రితంగా కాశీనగరంలో సదానందయోగి యనే మునీశ్వరు డున్నాడు. ఆయన దేశమంతా తిరిగి యెక్కడెక్కడున్న దేవతల క్షేత్రాలు - వారి పుట్టుపూర్వోత్తరాల నన్నింటిని ఆకళింపు జేసుకొనిన మహాదిట్ట. వానికి సంసార బంధాలు కాని, తాపత్రయాలు కాని యేమీలేవు. ఇంకొకరాయనమీద ఉమ్మి వేసినా తుడుచుకొని తొలగిపోతాడేకాని వారివంక సరిగా చూడనైనా చూడడు. ఎపుడు చూచినా వానిలో యేదో ఆనందం నిండుతనాలే కనిపిస్తాయి. కాని చీకు చింతలుండవు. అందుకే ఆయన నందరు సదానందయోగి అని అంటూంటారు.

సదానందయోగికి శిష్యులుగూడ వున్నారు. వారందిరిలోను చిదానంద యోగి మొదటివాడు. ఆ గురుశిష్యుల న్యాయం చెప్పుకోతగ్గది. ఒకానొక సమయంలో సదానందయోగి తన ప్రియశిష్యుని పిలిచి "నాయనా! చిదానందా! నాకు కాశీ రామేశ్వర యాత్ర చేయు తలంపు కలిగింది. నీవు నీ సహాధ్యాయులు నా వెంట బయలుదేరండి. మీకు నేను కాశీ నుండి రామేశ్వరం వరకు దారిలోనున్న ప్రధాన నగరములు, క్షేత్రములు, నదులు, తీర్థములు, వనములు మొదలయిన వానిని చూపుతూ, వాని వాని పురాణ వైభవ మహాత్మ్యములను గూడ చేతనయినంత దనుక చెప్పగల" నన్నాడు.

ఆ మాటలకు మహాభాగ్యమని నమస్కరించిన చిదానందుడు తోడి శిష్యులందరను పిలిచి కూర్చుండబెట్టాడు. అంతట గురువులవారు "నాయనలార! మనము యాత్ర సేయ బయలుదేరుటకు మీరీ కాశీ నగరాన్ని గురించి ముందు కొంతయినా తెలుసుకొనడం మంచిది. ఈ వారణాసి యందలి ప్రతి క్షేత్రము-ప్రతి తీర్థము- ప్రతిదైవములను గురించి పరిపూర్ణముగా చెప్పవలయునని బ్రహ్మదేవునికయినా వశముకానిదై యుండగ నేనెంతవాడను? అటులని మానవుడు నిరుత్సాహ పడరాదు కనుక నేను పెద్దల వలన వినిన వానిని సముగ్రముగ చెప్పెదనని కథాగమనం ప్రారంభించారు.

## కాశీనగర విశేషణము

"నాయనలార! కాశీనగరానికి మరొక పేరు శివ రాజధాని. ఇది భగీరథీ నదికి పడమరగా నది ననుసరించి వక్రము గలిగి యైదుక్రోసుల విస్తీర్ణమైన మహా పట్టణము. దక్షిణము నుండి ఉత్తరముగా ప్రవహించుచున్న ఈ నదీతీరముననుసరించి నగరము పొడవున అరువది నాలుగు తీర్థములున్నవి.

పూర్వం దక్ష ప్రజాపతి తన పెద్ద కుమార్తెఅయిన సతీదేవిని శివునికిచ్చి వివాహం చేశాడు. కాని ఒకానొక సమయంలో అల్లుడుమీద నాగ్రహించిన

దక్షుడు కుమార్తెను గూడా పిలువకుండానే మహాయజ్ఞం చేయ ప్రారంభించాడు. పిలువకపోయినా పుట్టినింటిమీద మమకారం చొప్పున పెనిమిటి నొప్పించుకొని చూడవచ్చిన సతీదేవి పరాభవం పొందినందున యోగాగ్నిలో పడి చనిపోయింది. శివుని భార్యమీద మోహం పోనందున ఆమె ప్రేతాన్ని తన భుజంమీదనే వేసికొని దేశ దేశాలు తిరిగాడు. అది చూసిన విష్ణుమూర్తి యోగమాయచే సతీదేవి మృత దేహాన్ని ముక్కలు ముక్కలుగా చేశాడు. అప్పుడాదేవి ముఖం ఈ కాశీ పురంలో బడినందున దీనికి "గౌరీముఖ" మనే పేరు వచ్చింది. ఇప్పుడిది ముఖ పీఠమయింది. ఇచటి దేవతపేరు కాశీ విశాలాక్షి, కంచి కామాక్షి, మధుర మీనాక్షి ముర్వురు ప్రఖ్యాతిగల దేవతలు.

అటులనే కేశికదేవి వెలసిన మణిపూర్ నందు వెంట్రుకలు పడుటచే నది కేశపీఠమయింది. జ్వాలాముఖీ దేవత వెలసిన పంజాబునందు నాలుక పడుటచే నది జిహ్వాపీఠమయింది. నయనా దేవత వెలసిన పంజాబున కన్ను పడిన చోట నయన పీఠమయింది. మీనాక్షీ దేవతవలె వెలసిన మధురయందున్న కన్ను పడినచోట నయనపీఠమయింది. విమలాదేవి వెలసినజగన్నాధమునయందు కుచము పడినచోట స్తనపీఠమయింది. హింగుళాదేవి వెలసిన నగర నైఋతి భాగమందు పొట్ట పటినచోట నుదరపీఠమయింది. యోగదేవి వెలసిన ద్వారకయందు యోగ పీఠమయింది. సుందరీదేవి వెలసిన కలకత్తా ప్రాంతీయ సముద్రతీరమునగల అధినాధ క్షేత్రమందు భుజము పడినచోట స్కంధపీఠమయింది. తారాదేవి వెలసిన ఆసామీ ప్రాంతీయ గుహాట్షహరు నందు బొడ్డు పడినచోట నాభి పీఠమయింది. యోగనిద్రాదేవి వెలసిన కామరూప దేశమందు ఒకచోట యోనిపీఠమయింది. గుహ్యకాళి వెలసిన నేపాళమునందు నొకచోట గుహ్యాపీఠమయింది. ఉకేశ్వరీదేవి వెలసిన అసామీ ముల్కుగోలపాడునందు నొకచోట అంగుష్ఠ పీఠమయింది. కాళిదేవి వెలసిన కలకత్తాయందే యింకొకచోట గుల్ఫపీఠమయింది. ఇంకను యిట్టి పీఠములు కొన్ని అక్కడక్కడ ప్రఖ్యాతిగాంచి యున్నవి.

కామాదేవి వేంచేసియున్న యోనిపీఠం నవయోనిముద్రల యోగస్థల మని చెప్పబడుచున్నది. ప్రతి సంవత్సరం నిచట అషాడ బహుళ త్రయోదశి మొదలుగు నాలుగు దినములు అనగా త్రయోదశి, చతుర్దశి, అమావాశ్య, శ్రావణ శుద్ధ పాడ్యమీలు ఋతుకాలమనుచు స్త్రీలు మాత్రమే దేవి నారాధించుచుండుట యందు సాంప్రదాయంబుగ జరుగుచున్నది. పురుషులా సమయమున నచటకు పోరాదు. పోయినవారికి కీడు తప్పదు. ఈ మహాకాశీ క్షేత్రమునకు రాజు విశ్వనాధుడు. మంత్రి బిందు మాధవస్వామి. క్షేత్రపాలకుడు భైరవుడు, గణనాయకు లేబదార్గురు. ఇచట లేని దేవతలు- తీర్థములు- మహిమలు మరి యెందును లేవని పురాణములు చాటి చెప్పుచున్నవి.

## యా త్రా వి ధా న ము

నాయనలారా! ఈ క్షేత్రమున యాత్రికులు నిత్యయాత్ర తిధివార యోగ్య యాత్రికులు వార్షిక యాత్రలు పంచకోశ యాత్రలు గాక ఏకరాత్ర వ్రత దీక్ష, ద్విరాత్రవ్రత దీక్ష, త్రిరాత్రవ్రతదీక్ష లనేకంబులుగ చేయుచుందురు. సూర్యోదయమునకు ముందుగానే మేల్కాంచి కాలకృత్యముల దీర్చుకొనిగంగలో స్నానాదులు ముగించుకొని అన్నపూర్ణా విశ్వేశ్వరులను దర్శించుట ప్రథమ కర్తవ్యము.

అనంతరమున ఒకక్రోసు దూరం నందున్న బిందుమాధవస్వామిని సేవించి, విశ్వేశ్వర మందిరం దగ్గరున్న ఢుంఢిరాజ గణపతి నారాధించి ఉత్తర ముగ ఒకటిన్నర క్రోసుదూరం నందున్న దండపాణిస్వామిని పూజించి కాల భైరవుని దర్శించి పడమర క్రోసుదూరం నందున్న కాశీమూర్తిని సేవించి వాయువ్యముగా కొంచెందూరం నందున్న గుహానుచూచి గంగాపుష్కరిణినికొల్చి విశ్వేశ్వర మందిరమందలి అన్నపూర్ణాదేవిని పూజించి మణికర్ణికకు పోయి మణికర్ణికమూర్తి నారాధించి అచటనే స్నానముచేసి తిరిగి విశ్వేశ్వర సన్నిధికి వచ్చి నమస్కరించి తర్వాత వసతికి చేరు విధానమును నిత్యయాత్ర యందురు.

మిగిలిన యాత్ర విధులను గురించి చెప్పుటకు సమయము కాదు. మనం రేపటినుండి యాత్రకు బయలుదేర వలయునని చెప్పిన సదానందయోగి మరు దినంబున శిష్య గణముతో గూడ బయలుదేరిపోయి గయా గదాధరలో మొదటి మజిలీ చేశారు.

## గంగా గదాధర క్షేత్ర మజిలీ

"నాయనలారా! త్రేతాయుగంలో వనవాసం చేయవచ్చిన సీతారామ లక్ష్మణులు కొన్నిరోజు లిక్కడున్నారట. ఒకనాడు సీతాదేవి ఏమీతోచక ఇసుకతో ముద్దలు చేసి పెట్టింది. ఈ క్షేత్ర ప్రభావం వలన ఆ యిసుకముద్దలు వారి పితృ దేవతలకు సంక్రమించినవై. శ్రీరాముడొకప్పుడు పితృదేవతలకు తర్పణలు విడిచి పిండ ప్రదానములు సేయగ దశరథ మహారాజీ యిసుక ముద్దలలో కనపడ్డాడు. రాముని మనసు చాలా బాధపడింది.

ఈ పని చేసిందెవరని రాముడడిగాడు. సీత భయపడి "నాకు తెలియ" దని బొంకింది. కాని ఫల్గుణితీర్థం నడుగగ నామె నిజం చెప్పింది. రాముడంతట తమ దండ్రులను — దాతలను క్షమాపణ గోరి క్రమమయిన పిండముల నీయగ పితృదేవతల అంగీకరించారు. తన పొరపాటు రామునికి చెప్పినందున సీతఫల్గుణి తీర్థంమీద కోపించి "నీవాడదానవయ్యి ఆడువారి నేరం దాచలేదు కనుక ప్రజల కంటికి కనపడకుండ ప్రవహింపు"మని శపించినదట. అటులనే వర్షములయందు తప్ప యితర దినములలో ఫల్గుణితీర్థ మీ క్షేత్రమున యిసుకపొరల క్రిందుగాగాక నేలమీద ప్రవహించుటలేని కారణమున పెద్దలుదీనిని "అంతర్వాహిణి" అన్నారు.

ఒక పెద్ద మందిరంలో చదరమయిన కుండమునందు మూరనిడివి గల నున్నని పాదమొకటి యున్నది. ఇది గయుని తలయందుంచబడిన శ్రీ మహా విష్ణువు కుడిపాదమనిచెప్పబడుచున్నది. దీనిమీద పిండముపడిన దినమొక్కటియు నుండదు. అటులనే యా క్షేత్రమున ఈ శివపాదము-కుమారస్వామి పాదము-బ్రహ్మపాదము - సూర్య పాదము - చంద్రపాదము - యింద్రపాదము-క్రౌంచ

పాదము - గణపతిపాదము - మతంగపాదము - అగస్త్యపాదము - కశ్య పాదము - త్రేతాగ్ని పాదత్రయమనునవి ముఖ్యములు.

విష్ణుపాదమున కీశాన్యమున గధాధరస్వామి విగ్రహమున్నది. దానికి పడమరగ రాతిగదయు కన్పట్టుచున్నది. కావున దీనికి గయాగదాధర క్షేత్రమను పేరు వచ్చినదని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించి పోయి ప్రయోగలో మజిలీ చేశాడు.

## ప్రయోగ మహాక్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ ప్రయోగ అలహాబాదునకు తూర్పు ఒకటిన్నర క్రోసు దూరం నందున్నది. దీనికి పడమరగ గంగానది ప్రవహించుచున్నది. దీనినే ధారాగంజా లేక ధారానగర మనియు నందురు. భోజరాజు పాలించిన నగర మట. ఇచట గంగాపుత్రులను నొక జాతివారున్నారు. వారచటి దృశ్యములను చూపి యాత్రికులనుండి ధనం సంపాదించుకొందురు. సమతలకూనకు క్రిందిభాగ మున పోయిచూచిన రెండు నిలువుల యెత్తున కొట్టివేయబడిన మర్రిచెట్టు కనపడ కలదు. అది అక్షయ వటవృక్షమనియు - దానిచుట్టునున్న శిలలు దేవతలనియు చెప్పుదురు. అచటకు దీపపు కాంతి సాయంతో పోవలయును.

గంగ యమున సరస్వతి యను మూడునదులు కలిసిన త్రివేణి ఇచ్చట ప్రవహించుచున్నది. రాజులిచట కోట నిర్మింపని నాడీ యక్షయ వటవృక్షపు కొమ్మలీ నదిమీదకు యొంగియుండెడివట. ఎవరయినను యీ చెట్టు కొమ్మలమీద కెక్కి వారి కోరికలను చెప్పి నీటిలో దుమికి చనిపోయిన యెడల వారు మరు జన్మలో వారి కోరికలను పొందుదురనుట కీకథ నిదర్శనము.

ఒకానొక సమయంబున ముప్వురు కన్య లాచెట్టుమీదెక్కి అందొకరు మహా పండితకవి నాకు భర్త కావలయునని - యింకొకరు ధైర్య సాహసములు గల ధీరుడు నాకు పతి కావలయునని - వేరొకరు గొప్ప కీర్తిగల ప్రభువు నాకు

పెనిమిటి కావలయునని చెప్పి ప్రవాహంబున దుముకుట చూసిన యొక మంగలి చెట్టునెక్కి వీరు ముగ్గురు నాకు భార్యలు కావలయునని చెప్పి నీటబడి మరణించి నందున నతండు మరుజన్మమున భోజరాజై పుట్టి వారి ముగ్గురును వివాహంబు లాడెనని గ్రంథములు తెలుపుచున్నవి.

హిమాలయముమీద బదరీ నారాయణాశ్రయమునకు వాయువ్యమున బుట్టి వసుధారయను పేరుతో బీనా దేశపు రాజమార్గమునకు పడమరగ పారి సరస్వతితో కలసి బ్రహ్మకపాలమునకు తూర్పుగా చని గంగ బదరీ కేదారములో నేకీభవించినంత భగీరథియను నామముధరించి హస్తినాపురము నంటుచు ముందుకు సాగి మీర్జాపూరు మీదుగా పయనించి కాశీక్షేత్రమునం దుత్తరముగా సాగి సముద్రములో గలియుచున్నది. అటులనే యమునానది గంగోత్రికి పడమరవాయువ్యములుగా ప్రవహించి, కళిందగిరి నుండి హస్తిన బృందావనం మధుర ఆగ్రా నగరంబుల దాగుచు వచ్చి ప్రయోగ దుర్గము మీదుగా పారి, భగీరథిలో కలియుచున్నందున త్రివేణీ సంగమ మయింది.

ఈ ప్రాంతీయులయిన గంగాపుత్రులు నీటిలో తేలుచున్న బల్లలమీద వేదికల నమర్చి యాత్రికుల చేత త్రివేణినదీ పూజయు, ముత్తయిదువుల చేత వేణి సమర్పణములు చేయించెదరు. ఇదియొక గొప్ప యాత్రాస్థలం. ఇక్కడకు క్రోసుదూరములో భరద్వాజాశ్రమమున్నది. రావణభానంతరమునరామున కిచ్చుట భరద్వాజమున ఆతిథ్యము నిచ్చినట్లు చెప్పబడుచున్నది. ఇంకను ఇందనేకము లయిన చూడదగిన పవిత్ర స్థలములు కలవని వివరించినసదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి అయోధ్యలో మజిలీ చేశాడు.

## అయోధ్యా పుర క్షేత్ర మజిలీ

నాయనలారా! మనమిప్పుడు మజిలీ చేసిన ఈ యయోధ్య పూర్వం శ్రీరామచంద్రునిచే పాలింపబడిన పుణ్యస్థలం. ఆనాటి రామ పరిపాలనలోని

యయోధ్యాపుర మొకప్పుడు సరయూనదిలో కలిసిపోయినట్లు చరిత్రచెప్పుచున్నది. ఐనను ఆనాటి కొన్ని మందిరములు ఇతర కట్టడములు మాత్రము మనకీనాడు క్రోసున్నర దూరమున కన్పట్టుచున్నవి. యాత్రీకులక్కడకును పోయి దర్శించు చుందురు.

ప్రస్తుత మీ సరయూ నదీ తీరమున కన్పట్టువానిలో రామఘాట్-భరత ఘాట్-లక్ష్మణఘాట్-శత్రుఘ్న ఘాట్-హనుమాన్ ఘాట్-వశిష్ఠఘాట్- వాల్మీకి ఘాట్-సుగ్రీవఘాట్-విభీషణఘాట్-స్వర్గధారఘాట్ మొదలయిన క్షేత్రము లెన్నో యున్నవి. త్రేతయుగంలో దశరథ మహారాజీ యయోధ్యను పాలించాడు. ఆయనకు కౌసల్య, సుమిత్ర, కైకేయి యను భార్యలు ముగ్వురున్నారు. వారికి చాలాకాలానికి శ్రీరాముడు, భరతుడు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అను నల్వురు కుమారులు కలిగారు.

అన్నదమ్ములందరూ పెరిగి పెద్దవారయ్యారు. మిధిలానగమేలే జనక మహారాజ పుత్రికలతో వారికి వివాహాలయ్యాయి. శ్రీరామునకిప్పుడు ఇరువదై దేండ్ల వయసు. రాముని పట్టాభిషేకం చేయించడానికన్ని ఏర్పాట్లు చేయించాడు దశరథ మహారాజు. ఆ సంగతి కైకేయికి తెలిసింది. ఆమె కంతకుముందే దశర థుడు రెండు వరాలిచ్చియున్నాడు. ఆ వరాలిప్పుడు కావాలంటూ కైకేయి రాముని పదునాలుగేండ్లు వనవాసం పంపించి భరతుని రాజ్యాభిషేకం చేయమని కోరింది.

ఆ కారణంగా కథ అడ్డంతిరిగింది. శ్రీరాముడుభార్యసీతను, తమ్ముడు లక్ష్మణుని వెంటబెట్టుకొని దండకారణ్యంవెళ్ళాడు. అక్కడ రామునికి రాక్షసులతో వైరం సంభవించింది. హనుమంతుడు సుగ్రీవులు నలనీలాచార్యులు మొదలయిన మిత్రుల సాయంతో లంకాధిపతి అయిన రావణునిగూడ చంపి విజయవంతంగా తిరిగి అయోధ్యకు చేరుకున్నాడు శ్రీరాముడు. దానినే రామాయణమంటారు. ఇప్పుడిక్కడ రామాయణానికి సంబంధించిన లీలలు చాలగలవని వివరించిన సదా నందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి మధురలో మజిలీ చేశాడు.

## మధురాపుర క్షేత్ర మజిలీ

నాయనలారా! యమునానది నంటుకొని యున్న మధురానగరము సకర్మిముగా నున్నందున వీధులు సరళముగ నుండకపోయినను రాతికట్టడములతో పురమలంకారముగ నున్నది. విశాలమయిన ఈనగరమందే గోకులము బృందావనము వేణువనము కుమారవనము దాళవనము గోవర్ధనవనము మానవ సరస్సులను పుణ్యక్షేత్రము లనేకములున్నవి.

ఇచట పేరుగాంచిన ఇరవదైదు ఘట్టములలోను విశ్రమఘట్ట మొకటి. అనగా నాడు కంసుని చంపిన తరవాత శ్రీకృష్ణుడు విశ్రాంతికై శయనించిన ప్రదేశము. దీనికి చేరువయందున్న మందిరములో శ్రీకృష్ణపాదములనబడు శిల లనేకములున్నవి. యాత్రికులు స్నానము చేసిన పిదప ఈ కృష్ణపాదము నభిషేకాదులతో సేవించు టాచారమై యున్నది.

మధుర యందలి దేవళంబులకు లెక్కలేదు. వానిలో ద్వారకానాధ మందిరము గొప్పది. స్వామి సన్నిధిలో ఎడమప్రక్కగ రుక్మిణిదేవి మూర్తి దర్శనమిచ్చుచున్నది. ఆలయ మండపమతి మనోహరముగనున్నది. గడిచిపోయిన యుగములలో మునులేగాక ముక్కోటి దేవతలు జపతపో నియమంబుల పాటించుచు నివసించిన ఆశ్రమములు నేటికిని మనకు కనపడుచున్నవి.

మధురకు నైఋతి భాగమునందున్న తెల్లని లింగమును భూతేశ్వరుడందురు. ఆ శివలింగమునకొక ప్రక్క ముఖము కలదు. పురాతనమైయున్న ఈ స్వామిని కృత త్రేతాయుగాలలో దేవ మునీంద్రులే గాక ద్వాపరమున కంసుడు మొదలయిన వారారాధించారు. కలియుగంబున యాదవ రాజుల సేవలందుకొనిన చరిత్రములున్నవి. స్వామువారి దేవిపేరు పాతాళసిద్దేశ్వరి. ఆమెయు దేవాలయ ప్రాకారమునందే వేంచేసి యున్నారు.

అచటకు కొంతదూరంలో శ్రీకృష్ణ జన్మస్థానమున్నది. అన్కపూర్వం మధురను పాలించే ఉగ్రసేన మహారాజు కుమారుని పేరు కంసుడు. ఉగ్రసేనుని

తమ్ముడగు దేవలుని కుమార్తె దేవకీదేవి ఉగ్రసేనుడు దేవకిని గూడ కన్నబిడ్డ వలెనె పెంచి పెద్దయ్యాక వసుదేవునికిచ్చి వివాహం చేశాడు. కంసుడు తన చెల్లెలిని బావను రథంమీద గూర్చుండ బెట్టుకొని అత్తవారింట చెల్లెలిని విడిచి పెట్టుటకు వస్తున్నాడు. ఆకాశవాణి బిగ్గరగ "ఓయీ కంసా! నిన్ను చంపే శత్రువు నీ చెల్లెలి ఎనిమిదవ కాన్పున బుట్టనున్నాడ"ని చెప్పింది. అపుడాలోచించిన కంస రాజు రేపు ముందెపుడో ఈమెకా కొడుకు పుట్టిందాకా యెందుకు? ఇపుడీమెనే చంపడం మంచిదనుకొని వెంటనే కరవాలందూసాడు. వసుదేవుడు భార్యను చంపవలదని బ్రతిమిలాడాడు కాని ప్రయోజనం లేకపోయింది.

చివరకు వారికొక విధంగా రాజీ కుదిరింది. దేవకికి ఎనమండుగురు కుమారులు పుట్టిందాకా తన దగ్గరనే యుండే నిర్ణయంమీద వారిద్దరను వెనుకకు తీసికొని వచ్చి చెరసాలలో బంధించాడు కంసుడు. తరవాత శ్రీమన్నారాయణ మూర్తి దేవకి గర్భాన నెనిమిదవ కుమారుడుగ జన్మించిన చోటే ఇది యని వివరించిన సదానందయోగి మరుదినమున ప్రయాణం సాగించి పోయి గోకులలో మజిలీ చేశాడు.

## గోకుల మహాక్షేత్ర మజిలీ

నాయనలారా! మధురకు మూడుక్రోసుల దూరంలో ఈ గోకుల మున్నది. ఇచ్చటకు లెక్కకు మించిన తీర్థములు ఘట్టములున్నవి. నాడు చెరసాల యందుంచబడిన దేవకీ వసుదేవులకు శ్రీహరి దర్శనమిచ్చి "పుణ్యదంపతులారా! నేను కంసాది దుష్టులను సంహరింప మీ కడుపున పుట్టబోవుచున్నాను. కాని నేనిం దుండ రాదు. వ్రేపల్లెలోని నందునిభార్య యండే యశోదకు యోగమాయశ్రీయను పేరున స్త్రీశిశువుగా జన్మించియున్నది. నన్ను మీరి మద్దిమరేయియందే వ్రేపల్లెకు గొనిపోయి యశోద ప్రక్కలో పరుండబెట్టి ఆమె చెంతనున్న మాయను దెచ్చి కంసున కీయండి" అని చెప్పి మాయమయ్యాడు.

దేవదేవుని మహిమచేత చెరసాల బీగములు వానంతట నవే యూడిపోయినవి. కావలివాండ్రు మాయగప్పి నిద్రలో పడిపోయారు. యమునా నది దారి యిచ్చింది. వసుదేవుడు వ్రేపల్లెలో ప్రవేశించిన చోటను "నందకవాటమని" చెప్పబడుచున్నది. అటులనే గోవులను గాయుచున్న చిన్నికృష్ణయ్య మన్నుదిన్న చోటు గోవర్ధనగిరి నెత్తిన స్థలము యశోదానందులు బలరామకృష్ణులను వూయేలతొట్లలో నుంచి యూపిన దృశ్యములు బాలకృష్ణునిలో యశోద యోగమాయను చూచి విస్మయమొందిన విధము లోహముతో చేయబడిన ఆలమంద నడుమనున్న మదనమోహన కృష్ణ ప్రతిమల నెన్నింటిలో నవమినాడు కన్నుల పండుగగ చూడగలము.

యమునానదీ తీరపుటిసుకపై నాడు బాలకృష్ణుడు పవళించిన ప్రదేశమును కాచుకొని యున్నవారు యాత్రికులు నచట ప్రొర్లిగింతలు పెట్టించిన తరవాత నచట యిల్లు మాదిరి గీతలుగీచి మంత్రము ద్వారా దేవతల నావాహనము చేసినాడు. శ్రీకృష్ణుడు తినిన మన్నును యిసుకతో కలిపి ఈయగ భక్తులు కానుకలు సమర్పించి ఆ మన్నును భక్తితో గొనిపోయి పూజింతురు. మరియు నాడు గోకులమునకు తూర్పు దిక్కున గోవింద కుండమున్నది. శ్రీకృష్ణుడు పూతనను చంపిన గోటని గోవింద కుండమున యాత్రికులు స్నానాదులు చేయుదురు. కాని దానికి తూర్పాగ్నేయములుగా పురాతన గోకులమున్నది. యశోద చల్లచిలికిన దచటననే చెప్పుచున్నారు. అచట చాలాకాలము నాటి రాతి కట్టడములు మనకిపుడు కనపడుచున్నవి.

గోకులమునందు నాటి శ్రీకృష్ణలీలలు సంబంధించినదృశ్యములన్నియు కలవు. మరియు నందలి తీర్థములు - క్షేత్రములు - దృశ్యములన్నియు మహాపవిత్రములయినవని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి బృందావనంలో మజిలీ చేశాడు.

## బృందావన క్షేత్ర మజిలీ

నాయనలారా! మధురా నగరమునకు గోకులము వలెనే యీ బృందావనము కూడా మూడు క్రోసుల దూరమున యమునానదికి దక్షిణముగ నున్నది. ఇచటను తీర్థక్షేత్రములకు లోపములేదు. శ్రీమహావిష్ణువు చెప్పిన చందంబున వసుదేవుడు వ్రేపల్లె నుండి తిరిగి వచ్చినంతనే తలుపులు మూతబడినై. "కొక్కొరోకో" యని తొలికోడి కూసింది.

చోరాఘాటునందు కృష్ణుడు తుమ్మెదలతో ఆటలాడినచోటు భ్రమర ఘట్టం మనబడుచున్నది. హనుమంతుడు శ్రీకృష్ణునారాధించిన చోటు హనుమద్ఘట్టమని గోపికలు స్నానములు చేయుచుండ బాలకృష్ణుడు చీరెలపహరించినచోటు చేలాఘట్టమని నందబాలుడు గోపికలతో వాగూడి ఆటలాడినచోటు రాసక్రీడా ఘట్టమనియు చెప్పబడుచున్నవి. దానికి దక్షిణముగ రాధా మందిరమున్నది.

నాడు శ్రీకృష్ణుడు కాళింది మడుగులో కాళీయుని తలమీద చిందులు త్రొక్కిన చోటునందే కాళీయఘట్టమున్నది. ఆ పరిసరములందు కాళీయునిగా పోల్చుకొనదగిన నిలువెత్తు పుట్టయు, యశోదనందుల ప్రతిమలు, శ్రీకృష్ణమూర్తి, ప్రసన్న వేణుగోపాల విగ్రహాలు కలవు. బంశీఘాటన చెప్పబడుచోటున బలరామ కృష్ణుల చరణంబులు కదంబ వృక్షము క్రిందనున్న దృశ్యములు నున్నవి.

బృందావనము నుండి మధురా నగరము పోవు మార్గమున యమునకు ఉత్తరముగ అక్రూర మందిరము, దానికి సమీపమందలి వనములో భైరవాలయములే గాక, సేవాకుంజరమను పేరున నొక పవిత్ర స్థలమున్నది. అచట నివసించువారు శ్రీకృష్ణ పాదములను రాగితోను, వెండితోను, బంగారముతోను అమ్ముకొనుచున్నారు. భక్తాదులు వారి శక్తికిం దగిన పాదములను కొని పూజించుకొనుచున్నారని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి గోవర్ధనగిరి మజిలీ చేశాడు.

## గోవర్ధనగిరి క్షేత్ర మజిలీ

నాయనలారా! మనమిపుడు మజిలీ చేసిన యీ గోవర్ధనగిరి మధురా పురికి యేడు క్రోసుల దూరమున నున్నది. శ్రీకృష్ణుడు గోవులను కాయుచుండ బ్రహ్మాది దేవతలకు కృష్ణుని శక్తి పరిశీలించాలని కోరిక కలిగిందట. దేవేంద్రు డంతట అప్పటి కప్పుడే కారు మేఘాలను రావించి కుండపోతగా వాన కురిపించాడు. కృష్ణుడది గమనించి వెంటనే తన యెడమచేతి చిటకెన వ్రేలి గోటి మీద నా గోవర్ధనగిరి నమాంతంగా యెత్తి తన ఆవులమీద గోపబాలుర మీద చినుకైన పడకుండా కాపాడాడు.

ఆ కొండ తూర్పు పడమరలుగా ప్రాకి రాలవరుసతో వంతెనట్లు కన్పట్టు చున్నది. దాని వలన నొక జలాశయము రెండుగ చీలి బ్రహ్మతీర్థమనియు లేక మానసగంగ యనియు నామముల పొందింది. గోవర్ధనగిరి నీ పడమర భాగంబున గ్రామమున్నది. తూర్పు చివర కొన్ని మందిరములు మాత్రమున్నవి. ఆ మందిరంలో ఒకదానియందు గుండ్రములుగా గాక, నలుచదరములుగా మలచబడిన రెండు శివలింగములున్నవి. వానిలో తూర్పున నున్న లింగము పేరు నందుడు పడమర నున్న శ్రీకృష్ణలింగము నచటివారు పాలతో నభిషేకించి పూజించుటాచారమై యున్నది.

సేతువుకకు పడమటి భాగమందలి గ్రామములోను కొన్ని మందిరములున్నవి. సకలేశ్వర మహాదేవుడు; మానసదేవి ప్రతిమలు-శ్రీకృష్ణమూర్తులున్నవి. వానిలో గోవర్ధనగిరి నెత్తిన బాలకృష్ణ విగ్రహము ప్రధానమైనదని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి పాటలీపుత్రంలో మజిలీ చేశాడు.

## పాటలీపుత్ర క్షేత్ర మజిలీ

నాయనలారా! పూర్వమొకప్పుడు పాటలియను యువతియు పుత్రుడు అను యువకుడు భార్యాభర్తలై యీ నగరం నిర్మించినట్లు చరిత్ర చెబుతూంది. ఇరువది నాలుగు క్రోసుల దూరమున్న యీ పాటలీపుత్రము గంగానదికి దక్షిణముగ నున్నది. ఇచట ఏకముఖ; ద్విముఖ; త్రిముఖ; చతుర్ముఖ; పంచముఖ శివలింగముల లనేకములు ప్రతిష్ఠలు చేయబడినవి. ఎన్నియో దేవాలయములున్నవి. పురవీధు లన్నియు సమస్త వస్తువులు లభింపకల అంగడులతో సుందరములై యున్నవి.

పాటలీపుత్రము యొక్క రాజధాని మొదటి పేరు కాలీకాతా. కాలీకాతా యనగా కాళికాదేవి నివసించు చోటని యర్థము. ఇచ్చట కాళికాదేవి ఖాడవైన నాలుకతో భయంకరముగ దక్షిణాభిముఖమై వున్నది. మూఢనమ్మకం గల భక్తులీ నాటికిని అమ్మవారిముందు గొరియను మేకలను చంపెడి యాచారం మిక్కుటముగ నున్నది. కాళి వేంచేసివున్న యీ భువనేశ్వర స్థలం ఐదు క్రోసుల విస్తీర్ణమైనది. ఈ క్షేత్రములలో కోటి లింగములున్నవని జనప్రతీతి. వానిలో ప్రముఖమైన భువ నేశ్వరస్వామి లింగము వలనచే దీనినీ భువనేశ్వరస్థల మనుచున్నారు. లింగరాజని ప్రసిద్ధికెక్కిన యీ స్వామి స్వయంభూయని కొందరు-బ్రహ్మదేవుని ప్రతిష్ఠయని మరికొందరు చెప్పుచున్నారు. ప్రస్తుత మందున్న దేవతామూర్తులు పతనావస్థ లందున్నవి.

ఈ పాటలీపుత్రము నందున్న వారందరు మహా శ్రీమంతులు. నగర వైభవాది విశేషములలో వర్ణనాతీతములు. శ్రీ భువనేశ్వరస్వాముల వారికి వార్షిక భోగములు నిరాటంకముగ జరుగుటకు గాను మహారాష్ట్ర ప్రభువులిచ్చిన గ్రామ ములు యితరాదాయములు పుష్కలముగా నున్నవి.

భువనేశ్వరాలయం మిగుల శోభాయమానము. దేవళము చుట్టునున్న చిన్న చిన్న కోవెలలో ఏకామ్రేశ్వర, విశ్వేశ్వర, ఉగ్రేశ్వర, బాలేశ్వర, లవ ణేశ్వర, చిత్రగుప్తేశ్వర, వైద్యనాదేశ్వర, సోమేశ్వర, జంబుకేశ్వర, ఉత్తరేశ్వరులే

గాక ఏకాదశమూర్తులు కొలువుదీరి యున్నారు. అంతేగాక గణేశుడు, కుమారస్వామి, భువనేశ్వరి, నంది, లింగరాజు,పార్వతి, సావిత్రి,చంద్రుడు, కల్పములు మొదలయినవి తగుస్థానములలో నెలకొల్పబడినవి. వీరందరిమధ్య సేవింపబడుచున్న భువనేశ్వరస్వామిని దర్శింపదలంచినవారు సమతలమునుండి మెట్లమీదుగా క్రిందికి దిగిపోవలయును. ఇచట ఏ కులంవారయినను స్వాములవారిని తాకి స్వహస్తములతో పూజించుకొనవచ్చును.

బిందుసరర స్తీరంబున బ్రహ్మాలయమున్నది. గయను శిరోగతుయనిజాజిపూరును నాభిగయమని, పీటామును పాద గయ యనియు చెప్పుచున్నారని వివరించిన సదానందయోగి మరుదినమున ప్రయాణము సాగించిపోయి పురుషోత్తములో మజిలీ చేశాడు.

## పురుషోత్తమ క్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ పురుషోత్తమ క్షేత్రమున కేజ గన్నాథక్షేత్రమనియు నామాంతరము. ఇది సముద్ర తీరమున కించుక పై భాగముననున్నది. శ్రీ జగన్నాథాలయము నీలచలగ్రామ మధ్యభాగమున నున్నది. ఇచట స్వామి సుభద్ర బలభద్రులతోకూడి యున్నాడు. నగరం విశాలమయిన వీధులతో సుందరముగ నున్నది. యాత్రికులు, సాధువులు, భక్తులు మొదలయినవారు బసచేయుట కనుకూలంగనెన్నియో మఠములు సత్రములు మందిరములు నిర్మింపబడినవి.

గ్రామమునకు తూర్పుగ క్రోసుదూరమున నింద్రద్యుమ్న హారాజు నిర్మించిన మందిరములున్నవి. జగన్నాథస్వామి రథోత్సవమునకు పోయినపుడా మందిరములో నివసించుచుందురు. స్వామివారి దేవళమును చుట్టుకొని యెన్నియో శిల్పములున్నవి. నైఋతి భాగమున అక్షయ వటవృక్షం ఆగ్నేయమున పెద్ద వంటశాల, పడమరగ ముక్తి మండపము, దానికి తూర్పున రోహిణి మండపపములు మొదయినవి కలవు.

గర్భాలయ మందలి వేదికమీద యెరుపు ముఖంగల సుభద్రాదేవియు, కుడివైపున తెల్లని ముఖంగల బలరాముడు-యెడమవేపున నీలముఖంగల జగన్నాథస్వామియు దర్శనంబు లిచ్చుచున్నారు. వారి చుట్టును ప్రదక్షిణం సేయనను వైన మార్గము నిర్మింపబడినది. ప్రతిదినమిచట యిరువదిరెండు వినియోగములు చెల్లుచున్నవి. స్వామికి నైవేద్యమిచ్చిన తరవాత అదే మందిరములోగాని అక్షయ వటవృక్షము క్రిందగాని భక్తాదులు వరుసలుగా కూర్చుండి స్వామి ప్రసాదము నందు కొందురు. ఆ సమయంబున కులమత విచక్షలుండవు. ఎంగిలి పట్టింపులంత కంటెను పాటింపరాదు. అందులకే కాబోలు మనవారు సామాన్యముగ సర్వమూ జగన్నాథమనుచుందురు. జగన్నాథస్వామి ప్రసాదమనినను దేవుడిచ్చినను-యెంగిలి దైనను కాదనక పుచ్చుకొనుటయే యిచ్చట శిష్టాచారము. నారద సూతశౌనకాది మహామునులీ జగన్నాథ క్షేత్ర మహాత్మ్యంబును మిక్కిలిగా కొనియాడి నట్లనేక పురాణములు చాటి చెప్పుచున్నవి.

## రోహిణీకుండ మహాత్మ్యము

నాయనలారా! జగన్నాథ మనంబడుచున్న యీ పురుషోత్తమ క్షేత్రం సముద్రతీరాన పది యోజనముల పొడవున నున్నది. ఇందును గురించిన యితిహాస మొందు కలదు. కృతయుగంబున హిరణ్యాక్షుండగు దానవుడు భూమిని చాప చుట్టి నట్లుచుట్టి గొనిపోయి సముద్రము నందడుగు భాగమున దాచియుంచాడు. ఆ సమయంబున లోకము నుద్ధరింప శ్రీమహావిష్ణువు వరాహరూపం ధరించి హిరణాక్ష్యుని చంపి భూదేవిని సంరక్షించాడు. అంతట బ్రహ్మదేవుడీ సముద్ర తీరమందలి పురుషోత్తమ క్షేత్రం నిర్మించిన తరువాతనే సృష్టికార్యం మొదలుపెట్టాడు.

తన సృష్టి యందవతరించిన జనులకు ముక్తిమార్గము చూపవలయునని తలంచిన బ్రహ్మ నారాయణమూర్తిని ప్రార్థించాడు. మాధవుడా సృష్టికర్తకు దర్శనంబిచ్చి "ఓయీ! చతురాననా! ఈ సముద్రతీరమున నీలాచల మొకటి

యున్నది. దాని ప్రభావ మెట్టిదియొ మునులకు—దేవతలకు-నీకును తెలియదు. మహాప్రళయ కెలమందైనను నేను శంఖచక్రగదా ధారినై యందు నిజశరీరము తోడ నిల్చియుందును. అందలి రోహిణి కుండమున స్నాతలై నన్నారాధించిన వారికి నేనీయని వరమొక్కటియు నుండదు. నీ వచటకుపోయి నన్ను సేవింపు" మని చెప్పి యదృశ్యమయ్యాడు.

నలుమొగంబుల వెల్గు నీలచల క్షేత్రమునకుబోయి అందు వేంచేసి యున్న జగన్నాథమూర్తిని, రోహిణ కుండములను, అందందుగల దృశ్యములు నవలోకించి ధన్యుడైనట్లుగా తొల్లి శంకరుడు కుమారస్వామికి చెప్పగ జైమిని తక్కిన ఋషులకు చెప్పినట్లు పురాణము తెలుపుచున్నవి.

## జగన్నాధావతరణము

నాయనలారా! ఇంద్రద్యుమ్న మహారాజు గొప్పదైవభక్తుడు. నీలచలం మీద జగన్నాధస్వామి సుభద్ర బలభద్రులతోడ కేళీవిలాసంబుగ విహరించుచున్నా డని బ్రాహ్మణ పండితులవలన నాలకించి నందున నింద్రద్యుమ్నుడు స్వామిని కన్నులార చూచి యానందించు సంకల్పమున పరివార సమేతంబుగ బయలుదేరి పోవునంతలో స్వామి వారి భక్తిని పరీక్షింపనెంచి యెవరికిని కనపడక నదృశ్య మొందెనట. రాజందులకు చింతించి తనకు దర్శనభాగ్యం ప్రసాదింపుమని ప్రార్థించుచు కొంతకాలమందే నివసించియుండగ ఒకనాటి రేయి జగన్నాధస్వామి యింద్రద్యుమ్నుని స్వప్నంబున కనపడి "భక్తాగ్రణీ! చింతింపకు కొలదిదినంబులలో పీ సముద్రపు టలలో కొయ్యద్రమానులు కొట్టుకొని రాగలవు నీవు వానిని తీయించి నా రూపమున విగ్రహములు చేయించి ప్రతిష్ఠగావింపుము. నీవు చిరకాలం రాజ భోగముల ననుభవించినతరువాత నాసన్నిధికి రాగల"వనిచెప్పి మాయమయ్యాడు.

అటులనే నీటి కెరటాలలో తేలియాడుచు వచ్చిన ద్రమానులు నారాజు వెలికి దీయించునంతలో విశ్వకర్మ భగవానుడు సామాన్య శిల్పి రూపమునుదర్శన మిచ్చి "రాజా! నేనీ దారువులలో దేవతామూర్తులు నిర్మించెదను. కాని ఒక

నియమమున్నది. మీ దూలంబులనొక మందిరంబున జేర్చి తలుపులకు తాళములు వేయింపుడు. నేనా లోపలనే యుండి శిల్పములను సేయుదును. నేను వెలుపలకు వచ్చి చెప్పువరకు మీరే పరిస్థితియందైనను తలుపుల దెరువురా" దనగా రాజంగీక రించి చెప్పినట్లు చేశాడు.

పని ప్రారభించి పది దినములయినది.

రాజమాత మనంబున "అయ్యో! లోపలనే యున్న శిల్పాచార్యు లిన్ని దినంబుల నుండి భోజనమయినను చేయకుండెనే"యని దలంచి మందిరం తలుపులు తెరిపింప నాజ్ఞాపించింది. తల్లిమాట కాదనలేక ఇంద్రద్యుమ్నుడు తలుపులు తెరచి చూచునంతలో శిల్పి యదృశ్యమయ్యాడు. రాజసేవకులెంత వెదికినను ఎక్కడ చూచినను శిల్పి కనపడలేదు. అప్పటికే దేవతామూర్తులు కరచరణంబుల చివర భాగంబులు తప్ప మిగిలిన రూపములన్నియు చెక్కుట పూర్తి అయినది.

ఇంద్రద్యుమ్ను డంతట జరిగినదానికై చింతించి బ్రహ్మదేవునియొద్దకు బోయి కర్తవ్య మడుగగ నా చతురాననుండు "నరపాలా! నీవా విగ్రహమును ప్రతిష్ట చేయగల తరుణము మించిపోయినది. మీ పాంచ్య బ్రాహ్మణుల యాజ మాన్యమునకే జగన్నాధస్వామి ప్రతిష్ఠయు, పూజారి వైభవములు జరుగుట దైవ నిర్ణయము, కావున నీవింక యింటికిపోయి వార్షికముగా స్వామి రథోత్సవం చేసి కొనుట కేర్పాటులు గావింపుము, నేనప్పుడు పది దినములు విడిది సేయుటకు మందిరముల నిర్మింపుము మరియు నచట నీపేరు నొక జలాశయమును గూడ నిర్మిం పుము. ఇంద్రద్యుమ్న సరోవరంబున భక్తాదులకు స్నానము చేసినను-పానము చేసినను-దానము చేసినను కైవల్యము తప్పక సిద్ధింపగల"దని చెప్పి పంపివాడు.

ఆనాటినుండి ప్రతి సంవత్సరం ఆషాడశుద్ధ విధియలు నాడు జగన్నాధ స్వామి రథోత్సవ మతివైభవముగ జరుగుచున్నది. అచటి సముద్ర తీరమున విధి వార నిర్ణయములు లేకయే యెల్ల దినములలో స్నానము చేసినవారు పవిత్రము లగు చున్నారారని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించి పోయి కూర్మేశ్వరంబున మజిలీ చేశాడు.

## కూర్మేశ్వరాలయ చరిత్ర

నాయనలారా! పూర్వము దేవదానవులు అమృతం కొరకు పాల సముద్రం తరచినపుడు శ్రీహరి తాబేలు రూపందాల్చి వారికి సాయం చేశాడు. తరువాత వారికి అమృత కలశం లభించింది. ఆ శుభ సమయంబున మాధవుడా కూర్మావతారము నందే శివలింగమును ప్రతిష్ఠించిపూజించినందున ఇచటి స్వామికి కూర్మేశ్వరుడనే పేరు వచ్చింది.

తరువాత చాలాకాలానికి రామానుజాచార్యులవారు వైష్ణవ మతప్రచారం చేయు సమయమున నీ యాలయము నందొకనాడు నిశీథముగ ప్రవేశించి స్వాముల వారికి శంఖచక్రాది భూషణంబుల నలంకరించి యెవరికిని తెలియకుండ తిరిగి పోయాడు. మరుదినంబున మధ్యవర్తులతో కలిసి తలుపులు దీయించి ఈ స్వామి వైష్ణవుడేనని యొప్పించెననియు, పంచరాత్రి విధానంబున నీ క్షేత్రమును గూడ తిరుపతిగా మార్చెననియు—నాటినుండి కూర్మేశ్వరుడు కూర్మనాయకస్వామిగా మారెననియు జనవాణి వినబడుచున్నది.

పూర్వకాలంబున శ్వేతకేతుండను రాజు దీక్షబూని గళింగపట్టణమందు నెలకొనియున్న కర్పూరేశ్వర సన్నిధిలో కొన్ని దినంబులు, శింగుపురమునందు నెలకొనియున్న సుందరేశ్వర సన్నిధిలో కొన్ని దినములు, సముద్రతీరం నందు నెలకొనియున్న రామలింగేశ్వర సన్నిధిలో కొన్ని దినంబులు ఈ కూర్మక్షేత్ర మందు నెలకొనియున్న పాతాళ సిద్ధేశ్వర సన్నిధిలో కొన్ని దినంబులు ఘోర తప మాచరించాడు.

పరమేశ్వరుడంతట వానికి సాక్షాత్కరించి "శ్వేతకేత మహారాజా! నీ భక్తిప్రపత్తుల కానందించాను. నీవు తపమాచరించిన ఈ యైదు క్షేత్రము లందును నేను స్వయముగ ప్రసన్నుడనై యుంటాను. నన్నారాధించిన వారికి సమస్త భోగముల నిచ్చెదను. ముంటియ్యాది మహా ప్రభావంగల దివ్యక్షేత్రము

కానున్న"దని చెప్పి యదృశ్యమయ్యెను. రామానుజాచార్యులవారు నూతనముగ చేయించిన శ్రీదేవి భూదేవి సమేత గోవిందరాజస్వామిమూర్తులు శ్రీదేవిభూదేవీ సమేత చక్రనారాయణస్వామి మూర్తులు! లక్ష్మణ సమేత సీతా కోదండరామ స్వామిమూర్తులు నిచట ప్రశస్తములై యున్నవి. నేటికీ ఈ మూర్తులన్నింటికి నిత్య నైవేద్యములు చెల్లుచునే యున్నవి. సముద్ర తీరమునందు వెలసియున్న హనుమదాలయంబున నెంతమాత్రమును సముద్రఘోష వినపడక పోవుట మహా శ్చర్య మనక తప్పదు.

ఇచటి కూర్మాకుండిక యను జలాశయమునందు ప్రతి మాఘ శుద్ధ చవితిలు నాటికి కాశినుండి గంగ వచ్చుచున్నది. యాత్రికులిందు స్నాన పాన దానాదులను సేయుచుందురని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి అరసవల్లిలో మజిలీ చేశాడు.

## అరసవల్లి క్షేత్ర మజిలీ

నాయనలారా! అరసవల్లి మొదటిపేరు హర్షవల్లి. సూర్యనారాయణ మూర్తి ఇచట ప్రముఖ దైవము. భక్తాదుల కథయు ప్రదానము నిచ్చుచున్న సూర్య మూర్తి సుందరముగా నున్నది. సూర్యాలయమందు యొక కోవిలలో శివ లింగమున్నది. ఇచట పుష్కరిణిలో శుచులయిన వారిని పూర్ణాయురారోగ్యముల-తేజస్సు-భాగ్య భోగములు కైవల్యమును సిద్ధింపగలవు.

సూర్యునకు ప్రియమయిన ఆదివారము లందిచట స్వామికి వేడుకలు జరుగుచున్నవి. ప్రతి మాఘశుద్ధ రథసప్తమిలలో మహోత్సవములగు చున్నవి. పుట్లకొలది పంచదార కలిపిన వేడిపాలను అమృతకుండియను పేరున స్వామి కారగింపు చేయించిన తరువాత త్రాగదలచిన వారికి తీర్థప్రసాదములుగ నిచ్చుటయు వారు త్రాగుటయు నిచటి సాంప్రదాయం.

ప్రయోగవాటి యనంబడు తాయకొాడ గ్రామంబున సిద్దేశ్వరుండను లింగము, దుంప గ్రామంబున కుత్తరముగ సోమేశ్వరుడను లింగము, సంగమార్గ హారమునను తూర్పుగ సంగమేశ్వరుడను లింగము, శ్రీకాముడంబుని కోటీశ్వరుండను లింగము, కళ్ళేపల్లియందుమనునాగేశ్వరుండను లింగములైదును ప్రసిద్ధములైనవి.

మహా భారతయుద్ధం సమీపించింది. బలరామకృష్ణులు వారికి బంధువులు ఐనను శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతియని తెలిసికొనిన బలరాముడు తమ్ముని కాదనలేక తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆయన దండకారణ్యములో పయనించు చుండగా, దప్పికకొని యా కొండనేలల యందెక్కడన్నను నీరుదొరకక బాధపడ వలసి వచ్చింది. ప్రస్తుతంబున తనకే గాక ముందు ముందు ప్రజలకయినా నుప యోగపడవలయునను తలంపున చేతగల నాగలిని భూమిమీద నచ్చటచ్చట గ్రొట్టుచు పయనించెను. వాడా బలరాముని నాగటికిందెగిన చోటు లందుదయించిన జలధారలు క్రమముగ స్వర్ణముఖి, వంశధార, ఝుంఝూవతి. లాంగవి నదులను నామములతో ప్రవహించుచున్నవి. నాడు లాంగవీనది యందే బలరాముడు స్నానాదులు చేసి నట్లు పురాణములు తెలుపుచున్నవి.

బలరాముడప్పుడు శ్రీకాకుళంబు నందొక లింగమును ప్రతిష్ఠించి యజ్ఞ మొనరించారు. యజ్ఞబోక్తగా విచ్చేసిన దేవేంద్రుడు డచటివారి భక్తి ప్రపత్తుల కానందించినందున వారికి సకలైశ్వర్యములు సమకూరుట కుపాయము నాలోచించి బ్రహ్మ విష్ణుమహేశ్వరాంశలు గలట్టియుకర్మసాక్షిఅయినట్టియు తేజోమూర్తియు నైన సూర్య ప్రతిష్ట స్వయముగచేసినట్లు క్షేత్రమహోత్సవములు చెప్పుచున్నవి.

నేను చూచినంతలో ప్రపంచమునందుసూర్యాలయ మీ యరసవల్లిలోనే కలదు. కోణార్కయనుచోట పూర్వమొక మహారాజా దరణమున శిల్పాచార్యులు నతి మనోహరముగ నిర్మించినట్లును వినుచున్నాము. అచట దైవాంశ సంభవుడైన యాశిల్పి బ్రహ్మ ఒక పెద్ద శిలయందు రథము, రథచక్రములు, రథాశ్వములు

మొదలయిన వానినన్నింటిని జీవకళ ఉట్టి పడేలాగున నిర్మించాడు. శిల్పి కుమారుం దొకనాటిరేయి శిలాశిల్ప మైయున్న రథము నెక్కి గుఱ్ఱములకు ప్రాణ ప్రతిష్ఠల గావించి, కోలచే నదిలించినంత రథం కదులుచు పెళ పెళ ధ్వనులు పుట్టెను. అది చూచిన వృద్ధ శిల్పాచార్యులు వెంటనే గుఱ్ఱముల కాళ్ళు నరికివేయగా నవి యథా పూర్వకముగ శిలా ప్రతిమలై నిలిచిపోయి నందున నేటికిని మనకు కన్పట్టుచున్న టులు కోణార్క సూర్యాలయ చరిత్రలు చెప్పుచున్న దని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించిపోయి సింహాచలంలో మజిలీ చేశాడు.

## సింహాచల క్షేత్ర మజిలీ

నాయనలారా! ఇది నరసింహక్షేత్రం. విశాఖపట్టణమునకు సమీపంనం దున్నది. విశాఖ యొక సుందరమయిన గొప్ప పట్టణం. ఇచట జలయాన యంత్రములను నిర్మాణం చేయు కర్మాగారం వున్నది. మరియు నెన్నియో గొప్ప సంస్థ లున్నవి. నగరం సముద్రం వంటి యోడరేవు (హార్బరు కలిగివున్నది) పట్టణము నందు గొప్ప వ్యాపార కేంద్రములు, కళామందిరములు మిక్కిలిగా నున్నవి.

పూర్వం హిరణ్యాక్ష హిరణ్యకశిపులనేవారు దానవ సోదరులు. వారి బాధలు భరింపలేక దేవమునీంద్రులు శ్రీహరితో మొరబెట్టుకున్నారు. అంత మాధవుడు వరాహరూపం ధరించి తమ్ముడగు హిరణ్యాక్షుని చంపినందున అన్నఅయిన హిరణ్యకశిపుడు విష్ణువుమీద పగదీర్చుకొన పంతం బట్టి వున్నాడు.

రాక్షసరాజున కింతలో ప్రహ్లాదుడనే కొడుకుపుట్టాడు. ప్రహ్లాదునిపుట్టుక నుండి విష్ణుభక్తిపట్టుబడింది కుమారుడించుక పెద్దవాడయ్యాక తండ్రి "వైకుంఠుడు మనకు పగవాడు వాని నామస్మరణం చేయవల"దని చెప్పాడు. కాని ప్రహ్లాదుడు తండ్రి మాట వినలేదు. తండ్రి కుమారుని బెదిరించాడు. చివరకు చంప ప్రయత్నిచాండు. కాని ఫలితం లేకపోయింది. ప్రాణం విసిగిపోయి నీ హరి యెక్క

ఉన్నాడో చూపుమని హిరణ్యకశిపుడు గద్దించాడు. ప్రహ్లాదుడందులకు "హరిలేని చోటేలేదు. అంతటా యున్నా"డని బదులు చెప్పాడు. మరింత కోపం చెందిన హిరణ్యకశిపుడు "ఐతే ఈ స్తంభంలో చూపు"మని గదతో కొట్టాడు. స్తంభం పెళపెళారావం చేస్తూ పడిపోయింది. స్తంభంనుండి శ్రీహరి నరసింహరూపంలో బయటకు వచ్చి రాక్షసేంద్రుని సంహరించాడు.

అట్లు హిరణ్యకశిపుని వధించిన నరసింహమూర్తిని ప్రథమంబుగా కీర్తించిన ప్రహ్లాదుడే ఈ సింహాచలమందలి స్వామిని ప్రతిష్ట చేసినట్లు యితిహాసము చెప్పుచున్నది. ప్రతి వైశాఖశుద్ధ తృయతదియలందు సింహాచలనరసింహమూర్తి నిజరూపమున ప్రకాశించు చుండుననియు జన ప్రతీతి కలదు. ఆనాడీచోట స్వామి కభిషేకములు వైభవములు జరుగుచున్నవి. యాత్రికులు నిత్యము వచ్చుచున్నారు. స్వామి పూజాదులు చేయు పరివారములో వైష్ణవులు స్మార్తులను కలసి పనిచేయుచున్నారు.

ఇంకొక విశేషమేమనగా—ఈ విశాఖపట్నమునకు చేరువయందున్న వయుమాక యను క్షేత్రము కూడా ప్రభావము కలది. శ్రీనివాసావతారమున విష్ణుమూర్తి ఆకాశరాజు కుమారియగు పద్మావతిమీద వ్యామోహముతో వేటనెపంబున వచ్చినపుడొక యాదవుడా మహనీయునకు పాలు సమర్పించిన దిచటనేనని పురాణములు చెప్పుచున్నవి. అచటి దేవాలయము చూడ చిన్నదైనను మహిమలో తక్కువకాదు. పర్వతమునకు దిగువగ స్వామి పుష్కరిణికి సమీపము నందున్న కోవెలలోనే వెంకటేశ్వరస్వామికి నిత్య నైవేద్యాది భోగములు జరుగుచున్నవి. దాని కీశాన్యమున నున్న దేవాలయంబునను నిత్య భోగములకు లోపము లేదు. నృసింహాద్రి సాలిగ్రామము అమితముగ నున్నవి.

మరికొంత దూరమున పిఠాపురమున్నది. అచటి ప్రఖ్యాతి దైవము కుక్కుటేశ్వరుడు. కోడియాకారముననుండుటచే ఈ స్వామినికుక్కుటేశ్వరుడనుచున్నారు. పైనున్న పాత్రలోని జలమభిషేక బిందువులుగా దేవునిపై బడి

నపుడవి కుక్కుటేశ్వరుని ముక్కునుండి క్రిందకు జారుచున్న దృశ్యము మనము చూడగలము. ఇందు వేంచేసియున్న రాజ రాజేశ్వరీదేవిని కూడా నిత్య వైభవములు యధావిధిగా జరుగుచున్నవి

ఆలయ ప్రాకారము నం దీశాన్యముని నున్న విష్ణుపాదముల మీద యాత్రికులు పిండములను వైచి పుష్కరిణి యందు విడిచిన ఫలితమును పొందుచున్నారు. పిఠాపురం రాజావారి కోటపురమునందున్న దని వివరించిన సదానంద యోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి రాజమహేంద్రవరంలో మజిలీ చేసాడు.

## రాజమహేంద్రవర క్షేత్ర మజిలీ

నాయనలారా! పుణ్యగోదావరీ నదీ తీరమునందున్న ఈ రాజమహేంద్రవరం పౌరాణిక స్థలమేగాక చారిత్రాత్మక స్థలమునై యున్నది. ఈయఖండగౌతమీ తీరమున మృకండమహాముని కుమారుడయిన మార్కండేయునకు సంపూర్ణాయువు విచ్చిన శివలింగము కూడ వెలసియున్నది. జనార్ధనక్షేత్రమని పేరుగాంచిన కోటిలింగాల క్షేత్రమిందేయున్నది. గౌతమ మహామునియు నీ ప్రాంతమునందే తపమాచరించినందున నిదియెంతయో పుణ్యస్థలంబని చెప్పదగియున్నది.

పాండవుల సంతతి వాడయిన రాజ రాజ నరేంద్రుడు కొంతకాలం క్రిందట నీరాజమహేంద్రమును పాలించాడు. రాజాస్థాన కవి అయిన నన్నయభట్టారకుడే వ్యాస విరచితంబైన సంస్కృత భారతము నాంధ్రీకరించిన ముగ్గురు కవులలో మొదటివాడు. అధర్వణాచార్యుండను యొక కవి భారతమును తెలుగు సేత చేసికొనివచ్చి వినిపింపగ నన్నయభట్టుఅసూయాగ్రస్తుడై కపటోపాయంబున వాని భారతమును తగలబెట్టించినట్లును-ఆ సమయమున నెవరికో చదువుకొనిన ఇచ్చిన విరాటపర్వము మాత్ర మగ్గిపాలు గాక ఈనాటి వరకు నున్నదను విషయమొకటి తెలియచున్నది.

రాజరాజ కుమారుడు సారంగధరుడు. రాజరాజుగారి చిన్న భార్య చిత్రాంగి. ఒకానొక కారణమున చిత్రాంగి తన సవతికుమారుడయిన సారంగ ధరుని మీద కుత్రిమ నేరారోపణ చేయగ రాజు నిజము తెలిసికొనలేక కుమారుని కాళ్ళు చేతులు నరికించిన చరిత్ర లోకవిదితమై వున్నది. నేటికిని రాజమండ్రికి యూరి వెలుపల సారంగధర మిట్టయను నొక ప్రదేశము కలదు.

అటులనే రాజరాజుల వారి తండ్రి విమలాదిత్య విష్ణువర్ధనుడు విజయ యాత్ర గావించుకొని తిరిగి వచ్చుచు పెనుగొండ పట్టణమునకు విచ్చేయగ వైశ్య కుల పెద్దలయిన కుసుమ గుప్తాదులు వారికి స్వాగతమిచ్చారు. ఆ సమయంబున విష్ణువర్ధనుండు కుసుమగుప్తగారి కుమారి వాసవిని గాంచి ప్రేమించి వివాహంబాడ నిశ్చయించుకున్నాడు. కాని కుసుమ గుప్తాదులు వైశ్యులు-రాజు క్షత్రియుడు నైనందున నేమి-మరికొన్ని ఇతర కారణంబులచే నేమి ప్రభువులతో వియ్య మొంద సమ్మతించలేదు. ఆ కారణమున విష్ణువర్ధనుడు కోపోద్దీపిత మానసుడై వారినందరను బంధింప బయలుదేరిరాజమండ్రినుండి పెనుగొండకు వచ్చునంతలో వైశ్య ప్రముఖులు దంపతులుగను-వాసకాంబియు నగ్నికుండలములలో ప్రవేశిం చారు. ఆ వార్త విని విష్ణువర్ధనుడు తలపగిలి మరణించాడు. తరవాత వాసవి వైశ్యులకు కులదేవతఅయి పెనుగొండయందు ఆ వాసవీ కన్యకాపరమేశ్వరి యను పేరున వెలిసింది. ఆమెకు నిత్యదీపధూప నైవేద్యాది వైభవములు మహో న్నతముగా నూరూర జరుగుచున్నవని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించిపోయి భద్రాచలంలో మజిలీ చేశాడు.

## భద్రాచల క్షేత్ర మజిలీ

నాయనలారా! శ్రీరామక్షేత్రము లన్నిటిలో భద్రాచలం మిగుల పేరు గాంచింది. చైత్రశుద్ధ పాడ్యమీలు మొదలు నవమీలు వరకు లిచ్చట వైభవములు- నవమినాడు సీతారామ కళ్యాణ మహోత్సవములు వైభవముగా జరుగు

చున్నవి. ఆ వేడుకలు చూడ దూర దేశముల నుండియు ప్రజలు తండోప తండ ములుగా వచ్చుచున్న యాత్రాస్థలము.

కంచర్ల గోపన్న యను నియోగి బ్రాహ్మణుడు పూర్వ మీ భద్రాచలము నందుండెడివాడు. అయన మొదటినుండి శ్రీరామభక్తుడు. గోపన్నగారి ధర్మ పత్ని కమలాంబ. కుమారుడు రఘురాముడు దానధర్మమములు గల ఈ బ్రాహ్మణ కుటుంబం కొలది దినములలోనే సంపదను కోల్పోయింది. గోపన్న నిపుడందరు రామదాసని పిలుస్తున్నారు.

ఆ కాలంలో గోల్కొండ నేలుచున్న తానిషాయొద్ద మంత్రులుగా నున్న అక్కన్న మాదన్నలు రామదాసుగారికి మేనమామలు. వారిద్దరు ప్రభువులకు చెప్పి మేనల్లునకు భద్రాచలం తహశీల్దార్ పని ఇప్పించారు. గోపన్న మరల ధనవంతుడయ్యాడు, బ్రాహ్మణ సంతర్పణలు ముమ్మరంగా చేస్తున్నాడు. రామ భక్తి నానాటికి పెరిగిపోయింది.

అప్పటికి భద్రాచలము నందున్న పురాతన దేవాలయం పూర్తిగా శిధిలమైపోయింది. రామచంద్ర ప్రభువుల కాలయం లేకపోవడమా అన్న చింత వానిలో బలపడినందున వెంటనే పనివారల నియమించి కోదండరామాలయమును మనోహరముగా నిర్మాణము చేయించాడు, చుట్టు ప్రాకారం నిర్మించాడు. సీతమ్మ వారికి రాములవారికి లక్ష్మణులవారికి గూడ మణిహారములు, రత్నకిరీటములు మొదలయిన వానినెన్నింటినో యేర్పరచాడు. సీతారామ కళ్యాణాది ఉత్సవము నిది వరలో యెవరు చేసి వుండనంత వైభవముగ చేయుచున్నాడు. ధనమంతయు వ్యయమయిపోయింది. ప్రభుత్వం వారికి చెల్లించివలసిన రాజ పన్ను ద్రవ్యం మూడు లక్షల రూపాయలు చెల్లించలేకపోయాడు.

రాజద్రవ్యము నపహరించిన నేరముక్రింద రామదాసును రావించిన తానిషా వారాయనను చెరసాల యందుంచారు. తానీషా తరవాత గోల్కొండ చక్రవర్తుల పాలనఅంతరించిపోయింది. నేటికి హైద్రాబాదుకు సమీపమునందున్న

గోల్కొండ కొండమీద ఖిల్లాయను పేరున నాటి మొగలాయి కులీ రాజులనాటి కోట మనకు కన్పట్టుచున్నది. కొన్ని కట్టడములు శిధిలములైనను మిగిలిన యా కోట దృశ్యములను చూచిన వారానందింపక నుండజాలరు. "నాడు గోపన్న బంధింపబడిన చెఱశాల వున్నదిచటనే"నని గుర్తింపదగిన యవకాశము లీనాటికిన్ని కలవు.

రామదాసుగారిచే నిర్మింపబడిన రామాలయ ప్రాకారమంత రమణీయ మైనది. స్వాములవారికి చేయించిన వాహనములు,అలంకార భూషణములు నేటికిని దేవాలయాధికారుల స్వాధీనము నందున్నవి. రాజమహేంద్రవరము వారిచటకు రా నదీ ప్రవాహమున జలయానముల సౌకర్యమున్నదని వివరించిన సదానంద యోగి మరుదినంబున ప్రయాణం సాగించి పోయి విజయపురియని చెప్పబడుచున్న ఇంద్రకీలాద్రి దగ్గర మజిలీ చేశాడు.

## విజయవాడ క్షేత్ర మజిలి

నాయనలారా! రాజమండ్రి నుండి బయలుదేరిన మనం కొవ్వూరు యొద్ద గోదావరినిదాటి నిడదవోలు, ఏలూరు, కొండపల్లి నగరముల మీదుగ యీ విజయపురిని చేరుకొంటిమి. ఈ నగరము మున్ను మాధవవర్మ యను ధర్మ ప్రభువుచే పాలింపబడినట్లు, నాడీ పట్టణమునకు కనకపురి యనుపేరు వచ్చి నట్లును శాసనముల వలన దెలియుచున్నది.

సహ్యాద్రి యందుదయించినదనియు, బృహస్పతి కన్యారాశి యందున్న ప్పుడు పుష్కరిణి యగుచున్నదియు జీవనదియునైన కృష్ణవేణి ఈనగరమునంటి యిచట యింద్రకీలాద్రిని రెండు భాగములుగా విడదీసికొని ప్రవహించు చున్నది. పూర్వం దుర్గాసురుడు మొదలయిన దుష్టదానవులను సంహరించిన ఆదిశక్తి యీ యింద్రకీలాద్రిమీద కనకదుర్గాదేవియై వేంచేసి వున్నది. ఆ స్థలము కనక

దుర్గ మల్లేశ్వర క్షేత్ర మనుచున్నారు. మహిషాసురుని వధించినందున నీమెకు మహిషాసుర మర్దనియనియు నామాంతరము. కొండమీదికి చక్కని సోపానము లున్నవి. ఆలయ పాలన కర్తలున్నారు. నిత్యము దేవిని దర్శింప యాత్రికులు వచ్చుచున్నారు.

ఈ కొండమీదనే ప్రఖ్యాతిగాంచిన భ్రమరాంబా సమేత విజయేశ్వర స్వామి దేవాలయము పురాతనమై వున్నది. నాడు కొన్ని మైళ్ళ వైశాల్యమున నున్న ఈదేవళ ప్రాకారమిపుడు పూర్తిగ హరించిపోయింది. విజయేశ్వరస్వామి సన్నిధిలో వీరభద్ర, సుబ్రమణ్యేశ్వర, నందీశ్వర, విఘ్నేశ్వర ప్రతిష్టలునుచేయ బడి వున్నవి. అందొక వేయి స్తంభముల మండపంబున్నది. మహాశివరాత్రి ఇచట వైభవోపేతంబుగ రజతోత్సవములు జరుగుచున్నవి.

అదిగాక ద్వాపర యుగమున పాండవ మధ్యముడైన యర్జునుండు తప మాచరించి శంకరునివలన పాశుపతాస్త్రము పొందినదియు నీ ఇంద్రకీలాద్రి మీదనే నని పురాణములు చాటి చెప్పుచున్నవి. కృష్ణానది కొకప్రక్క యీ ఇంద్ర కీలాద్రియు, రెండవప్రక్క సీతానగరం కొండయు గలవు. సీతానగరం కొండ మీద ప్రసిద్ధమైన గొప్ప సీతారామ దేవాలయమున్నది. ఇంటి స్వామికి వైభ వములు జరుగుచున్నవి. కొందరీ దేవాలయావరణమునందు వివాహాది శుభ కార్య ములు చేసికొనుచున్నారు. అచ్చటనొక చిన్న పల్లెవలె ఇండ్లు అంగళ్ళేగాక ప్రయాణ సౌకర్యములు నేర్పడినై. చాక్షుష మన్వంతరమున బ్రహ్మదేవుడు యజ్ఞము సేయుచుండగా సరస్వతీదేవి యేదియో లోపము జరిగినదని యాగ్ర హించి క్రతువు చూడవచ్చిన దేవతలను, మునులనుగూడ "మీరందరు నదులై పొం"దని శపించిందట. ఆ కారణమున మహావిష్ణువే కృష్ణానదిగాను-శివుడు వేణి నదిగాను-బ్రహ్మ కుముద్వతీ నదిగను రూపములను ధరించి సహ్యాద్రినుండి భూ పతనమై ప్రవహించుచుండ మిగిలిన మునీంద్రులు నారాయణి, కౌశిక, తులాస, భీమ, ముచికుంద, మహావైష్ణవి, భద్ర, విశాలాద్రి నామములతో ఉపనదులుగా కృష్ణవేణియందె కలసినట్లు నదీ పురాణములు తెలుపుచున్నవి.

దుర్గాక్షేత్రమైన కృష్ణానది తీరమున ఇంద్రతీర్థము, శివత్రిశూలతీర్థము, శంఖతీర్థము, ఋషితీర్థము, సోమేశ్వరతీర్థము, బ్రహ్మతీర్థము, నృసింహతీర్థము, ఫల్గుణతీర్థము, ముక్తితీర్థము లెన్నియో వున్నవి. విజయపురి పట్టణమునిందెన్నియో సత్రములు-మఠములు-దేవదేవాలయములను ప్రసిద్ధిచెందినవి. గొప్ప వ్యాపార కేంద్రము. ప్రయాణ సౌకర్యమున ఇది పెద్ద కూడలిస్థానము. నగరమును చుట్టు కొని పెక్కు గ్రామములున్నవని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి కృష్ణనుదాటి మంగళగిరినృసింహస్వామిని దర్శించు కొని గుంటూరు, చిలకలూరిపేట, ఒంగోలుమీదుగ పయనించి శింగరాయకొండలో మజిలీ చేశాడు.

## శింగరాయకొండ క్షేత్ర మజిలి

నాయనలారా! పూర్వము లంకాపతియైన రావణబ్రహ్మ యేలుబడిలోనే ఈ దండకారణ్య ముండెడిది. రావణుండిక్కడ తన బంధువులు - అనుచరులైన రాక్షసులను పాలకులుగా నియమించాడు. రామాయణకాలం నాటికి కరదూషణాదు లిచట పెత్తనపుదారులై యున్నారు. కరాటనుండి దేశమంతయును నాడు కర దూషణులనువారే పాలించిరనియు, ఇచ్చటకు పడమరగనున్న సేనంపాలెమనబడు చోటున వారి సేనా నాయకుండు కాపురముండెననియు చెప్పబడుచున్నది. దానికి చేరువలోనున్న ముచ్చేరు ననునదికి సీతాదేవి ఋతుమతియైన నాల్గవనాడు స్నాన మాడినపుడా నీటిచే నేర్పడినదనియు జనవదంతికలదు. ఆ కాలమునందిచట పర్య టించిన రామలక్ష్మణులు కరదూషణుల వధించినారనియు రామాయణము తెలుపు చున్నది.

సింగరాయకొండ మీద నాడు శ్రీరామునిచే ప్రతిష్ట చేయబడిన నర సింహమూర్తి వున్నది. దాని కించుక దక్షిణిముగ ఇందిరా మందిరములున్న దేవాలయ గోపుర మేడంతస్తులతో నిర్మింపబడినది. కోవెల వెనుక భాగము

నందొక భవనాశనియను పుష్కరిణి వున్నది. అదొక గుహాయు గుహముందొక యమ్మ విగ్రహములు కలవు. గుహాలోపల శయనించిన శ్రీరామచంద్ర విగ్రహము కలదు. ఈ గుహపొడవు చెప్పవలయు ననినల యిచేటికి పశ్చిమంబుగా నున్న వేదగిరియందలి నృసింహమూర్తి మందిరము వరకు నున్నదని ప్రసిద్ధి వినబడు చున్నది. ఈ గుహయందే యించుక భీతిగొలపు నరసింహాకృతి కూర్చొని వున్నది. నాటి కరాసురుడీ మూర్తి నారాధించెడి వాడట.

తూర్పునందొక క్రోసు దూరమున కరాటి సోటను కొండచోటున్నది. అది సముద్రమువంటి పై భాగమున క్రోసు క్రోసున్నర వైశాల్యమున సమతలముగా నున్నది. వాటి కరాసుర రాజధాని యదియేనట. నరసింహస్వామి ఉగ్రమూర్తియై నందువలన వాని దృష్టివలన ప్రజల ఉపకారము కలుగరాదని తలంచి నారదముని యీ నరసింహాని శాంతమూర్తినిచేసి ప్రతిష్టగావించినట్లొక జన వాక్యము కలదు.

పశ్చిమోత్తరములుగ ప్రవహించు పెన్నానదియు శింగరాయకొండనంటి పారుచున్నది. పెన్నానది యొక్క రెండవపేరు పినాకిని. జొన్నవాడ యందు కామాక్షి మల్లిఖార్జునస్వామి వేంచేసి వున్నాడు. బొగ్గేరు, చెయ్యేరులు రెండును వచ్చి పెన్నలో కలియు కూడలియందు సంగమేశ్వరాలయ మున్నది. కృతయుగంబున కశ్యపబ్రహ్మ యీ ప్రాంతమునందు యజ్ఞ మొనరించునపుడు పినాకీ నదికి దక్షిణమున వేంచేసివున్న రంగనాయకస్వామిని-జొన్నవాడ కామాక్షి మల్లిఖార్జున స్వామిని, వేదగిరి నరసింహస్వామిని, నెల్లూరు మూలస్థానేశ్వర స్వాములను గూడ ప్రతిష్టలు చేసినట్లు వినుచుంటిమని వివరించిన సదానందయోగి మరు దినంబున ప్రయాణము సాగించిపోయి శ్రీకాళహస్తిలో మజిలీ చేశాడు.

# శ్రీ కాళహస్తి క్షేత్ర మజిలీ

నాయనలారా! శ్రీకాళహస్తిని కైలాసము - భూతల కైలాసము - శ్రీపురము-విష్ణుపురము-మండలేశ్వర మనియు పిలుచుచుందురు. శ్రీకాళహస్తీశ్వర స్వామి మహాత్మ్యము గొప్పదిగనే వర్ణింపబడినది. కొండమీద దేవాలయ ప్రాకార గోపురము ప్రఖ్యాతి గాంచినది. ఈ స్వామిని వాయులింగమందురు. అది సయంభవు పర్వతం నంటుకొని మహా ప్రభావంగల సువర్ణముఖినది ప్రవహించుచున్నది.

స్వామి సన్నిధిలో శ్రీవారి దేవేరియైన జ్ఞాన ప్రసూనాంబయు సుప్రసన్న వదనయై దర్శన మిచ్చుచున్నది. ఈ క్షేత్రము నందెన్నియో పుణ్యతీర్థములు, దివ్యస్థలములు, దేవతామూర్తులు, వానికిగల ఇతిహాసములు గలవు. కాళహస్తీశ్వరుని సేవించి ధన్యులైన వారెందరో వున్నారు.

పూర్వకాలమున లింగము గుడిలోనుందుగాక బహిరంగమున నున్నపుడొక సాలీడు స్వామియందు భక్తికలిగి యెండ తగలరాదని తలంచి నీడపడునట్లు పైనున్న చెట్టుగొమ్మల నాస్కారము చేసికొని తన నూలిపోగులతో వలనల్లినది. పరమేశ్వరుడు దాని సేవకానందించి మోక్షమిచ్చినాడు. అటులనే మరికొంత కాలంబున కొకపామయు నాగలోకమునుండి మణులనుదెచ్చి సమర్పించుచుండెడిదనియు, ఒక యేనుగు ప్రతిదినము తొండముతో జలము తెచ్చి లింగము నభిషేకించు చుండెడిదనియు, శంకరుడా పాము, ఏనుగులకు ప్రసన్నుండయ్యెననియు పురాణములు తెలుపుచున్నవి. ఆ ముగ్గురివలననే ఈ దేవుడు శ్రీ కాళహస్తీశ్వరుడని పేరుగల వాడయ్యాడు. శ్రీ యనగ సాలెపురుగు-కాళమనగా సర్పము హస్తియనగా ఏనుగు. కావున నిది శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రమయింది.

మహాభక్త కన్నప్ప చరిత్రయు కొనియాడదగినది. కన్నడొక బోయ వాని కుమారుడు. ప్రథమంగ నీ లింగమును చూచినపుడే వాని మూఢభక్తి ఏర్పడింది. "ఏం స్వామీ! ఈ యడవిలో నొంటిగ నుంటివేమి? నీయందెవరునులేరా! పోని అన్నమైనను తింటివా? అయ్యో! మాటలాడకుంటివేమి? ఆకలివేయు

చున్నదా!" అని అడవిలోనికిపోయి దుప్పిమాంసము లింగము ముందుంచి తిన మన్నాడు. ఆయననుండి సమాధానం రానందున "నీవు తినేదాకా నేనూ ఏమీతిన" నని పట్టుబట్టి కూర్చున్నాడు. పరమేశ్వరుడంతట వాని భక్తి పరీక్షింప నెంచి లింగమునందే యొక కంటివెంట నీరు కారుచున్నట్లు కనపడేలాగా చేశాడు. అది చూచిన కన్నప్ప జాలిపడి "నీకన్ను దెబ్బతగిలినదా! నాకామాట చెప్పవే"మంటూ తన చేతియందున్న బాణంతో తన కంటిగ్రుడ్డు పెకలించి యా నీరు కారుచున్న కంటిమీద నుంచగనది శివమాయవలన నిలిచిపోయి రెండవకంట నీరుకార మొద లయింది. కన్నప్ప తన రెండవ గ్రుడ్డు గూడ ఇచ్చెదనని చెప్పి మరలబాణముతో తన రెండవగ్రుడ్డు పెకలింపబోవు నంతలో శ్రీకాళహస్తీశ్వరుడు నిజరూపమున దర్శనమిచ్చి "వత్సా! సాహసింపకు"మని వానికనేక వరములనిచ్చి యదృశ్య మయ్యాడు.

తరువాత కన్నప్పకు కైలాసము సిద్ధించింది. జ్ఞాన ప్రసూనాంబా శ్రీకాళహస్తీశ్వరస్వామి మహిమనెన్నెన్ని చెప్పినను తరిగేవికావని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి తిరుపతిలో మజిలీ చేశాడు.

## తిరుపతి క్షేత్ర మజిలీ

నాయనలారా! తిరుపతి వెంకన్న పేరు తెలియనివారుండరు. ఈ ఏడు కొండల వానికివచ్చే ఆదాయం ఇంకొక క్షేత్రమునందెచ్చటను లేదు. ఇచ్చట పాలనాధికారులు దేవుని సొమ్ము వెచ్చించి ధర్మసత్రములు మొదలైనవానిని నెల కొలపడమే కాకుండా మంచి కళాశాలను నడుపుచున్నారు. బీద కవుల రచనలు ముద్రణకుగాను ధనసహాయమును విరివిగ చేయుచున్నారు. యాత్రికులకెన్నియో వివిధ సౌకర్యములను కలిగించుచున్నారు. ఉచిత భోజనములను బెట్టుచున్నారు. సర్వ విధముల క్షేత్రాభివృద్ధికి తోడ్పడుచున్నారు.

దిగువ తిరుపతి నుండి యెగువ తిరుపతికి దేవాలయమువారును ప్రత్యేక ముగ బస్సులను నియమించియున్నారు. కావలసిన భోజన హోటలులు, విశ్రాంతి

భవనములు, గ్రంథాలయములు, చలనచిత్ర ప్రదర్శనశాలలు, వైద్య నిలయములు, అంగడులు కూడ తిరుపతియందెక్కువగ నున్నవి. అన్ని వైపులనుండి రాకపోకల కనువైన బస్సులేగాక కొన్ని రైలు వసతులున్నవి.

కొండమీదాలయ గోపురంబులకు బంగారు కలవని చెప్పుదురు. స్వామి వారి యాభరణాల విలువగట్టుట సామాన్యముకాదు. ధర్మదర్శనమునకై ప్రజలు క్యూలో బారులుతీరి గంటల తరబడి నిలుచుందురు. మ్రొక్కుబడులు చెల్లించుటకు వైభవములు చేయించుటకు కూడ కమిటీవారు నిర్ణయించిన రుసుములు చెల్లించ వలయును. అధికారులు నిర్ణయించిన రొక్కములిచ్చి స్వామి సన్నిధిలో వివాహ ములు చేసికొనువారి నందరను వరుసగ కూర్చుండబెట్టి దేవాలయమువారే వారి భజంత్రీలు-పురోహితులతో కళ్యాణములను జరిపించుచున్నారు.

ఒకానొక సమయంబున మాళవదేశ మందలి కళ్యాణపురమునకుచెందిన ధర్మపాలుండను పేరు కలిగిన విశ్వకర్మ బ్రాహ్మణుడు కంచుపాత్రలను విక్ర యింప తన పరివారములతో కాంచీనగరమునకు బోవుచు నొకనాటి రేయి శేషా చలమునకు దగ్గరలో శయనించినట్లును, వారి స్వప్నమునందొక దివ్యపురుషుండు కనపడి "ఆచార్యా! మీకు సమీపమునందే యున్న సుబ్రమణ్యేశ్వరాలయమందలి యంత్రములు నేడు ధనాకర్షణ జనాకర్షణమును కోల్పోయి యున్నందున నీవు వానిని సంస్కరించి పునఃప్రతిష్టలు సేయు"మని చెప్పినట్లును, మరు దినంబున ధర్మపాల శిల్పి బ్రహ్మ స్నానసంధ్యాది క్రియలు నెరవేర్చికొనిన తరువాత వేద మంత్రములను పఠించుచు పురాతన యంత్రములను వెలికి దీసి నూతన యంత్ర ముల ననుసరించిన నాటి నుండియే క్షేత్రమిట్లభివృద్ధి బొందునట్లు నొక ప్రబంధ ప్రమాణమున్నది.

ఆదినుండి శేషాచలము మూడు భాగములుగా కలసియే యున్నదట.

అందు దక్షిణ భాగమున బ్రహ్మయు, మధ్యభాగమున అహోబిల నరసింహ మూర్తియు, ఉత్తర భాగమున మల్లిఖార్జునులు కొలువైయున్నారు. ఒకప్పుడు దక్షిణము నందున్న మల్లికార్జునునిచూడ నుత్తరమునకు పోయినప్పుడు కుమార స్వామి బ్రహ్మతో "నీవెవర"వని యడుగ చతురాసననుండు నేను"సృష్టికర్త"నని బదులు చెప్పినందున స్కంధు డాగ్రహించి బ్రహ్మదేవుని కారాగారమున బంధించి తానే స్వతంత్రించి సృష్టి చేయబూన పూర్వము బ్రహ్మయున్న స్థానము నాక్ర మించినట్లొక కథ తెలుపుచున్నది. ఆ కుమారస్వామియే యీనాటి వేంకటేశ్వర స్వామిగ ప్రఖ్యాతి గాంచాడు.

కాని ప్రచారము నందున్న వేంకటేశ్వరుని చరిత్ర ఇందులకు విరుద్ధ ముగ జనవాడుక యందున్నది. ఒకానొక సమయంబున శ్రీలక్ష్మి పెనిమిటి మీద అలిగిపోయింది. శ్రీమహావిష్ణువు శ్రీనివాసుడై వేంకటాచల ప్రాంతమున దిరుగు చుండగ వరహస్వామి మిత్రుడయ్యాడు. వకుళమాత తల్లిగా నాదరించింది. శ్రీనివాసునకు ఆకాశరాజు కుమార్తె పద్మావతితో మహావైభవంగ వివాహం జరిగింది. పద్మావతి పినతండ్రియైన తొండమానుడి వేంకటాచలంమీద నిర్మించిన మందిరములో శ్రీనివాసమూర్తి లక్ష్మి పద్మావతితోసమేతంగ వేంచేసియున్నాడని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి కాంచీ పురములో మజిలీ చేశాడు.

## కాంచీపుర క్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ కాంచీపుర మాహాత్మ్యమును గురించి యెంత చెప్పినను తరుగదు. ఐనను చేతనైనంత దనుక మీకెరిగించెదను. ఇందున్న దేవత లందరిలో యేకామ్రేశ్వరుడు ముఖ్యదైవము. కృతయుగంబున పార్వతీపరమేశ్వరుడు ముఖ్యదైవము. కృపయుగంబున పార్వతీ పరమేశ్వరు లిందువిలాసముగ సంచరించిన సమయము — ఒకానొక సమయంబున గౌరీదేవి నవ్వులాటకు శంకరుని రెండు కన్నుల చేతులతో మూసింది. శివుడంతట "పార్వతీ! నీవు నాతో పరిహాసము లాడ దగినదానివే కాని కొంచమైనను యోచింపలేక పొరపాటు చేశావుగద!

నా నేత్రములు రెండును సూర్య చంద్ర స్వరూపములని నీకును తెలియును, నా కనుల మూసినంత కాలమీ ప్రపంచమున వెలుగులేక గాఢాంధకార మావరించింది. ఇది దేవమానమున మనకు స్వల్పకాలమైనను మానవకాల ప్రమాణమున యుగములు గడచిపోయినవి. సూర్యచంద్రుల వెలుగులేక ఎందరో నిత్యాహార పానాదులకు అలమటింప పాపము నీకు సంక్రమించింది సుమా!" అన్నాడు.

పార్వతి కపుడు నిజం తెలిసింది. తనకు చుట్టుకొనిన పాపమును పోగొట్టుకొనుట కీశ్వరుడు తెలిపిన చందంబున ఈ కాంచీ క్షేత్రమునకు వచ్చి యొక మామిడి చెట్టుక్రింద చాలాకాలం తపసు చేసింది. ప్రియురాలేమి చేయుచున్నదో చూడవలయునని పరమేశ్వరుడిచటకు మారు రూపమున వచ్చినందున చోరేశ్వరుడని చెప్పబడుచున్నాడు. తరువాత శంకరుడామెను లాలించి గాఢాలింగనము చేసికొని యిందే ప్రతిమగా నిలిచిపోయెనట. వారు మామిడిచెట్టుక్రింద

నున్నందున నీ స్వామికి ఏకామ్రేశ్వరుడని పేరు వచ్చింది. అ ప్రాంతము లీ మామిడిచెట్టు చాలా కాలము నాటిదని చెప్పుచున్నారు.

ఏకామ్రేశ్వరాలయమునకు ఆగ్నేయముగా కొలది దూరమున కామాక్షమ్మ దేవాలయమున్నది. ఆలయమునకు నాలుగు గోపురములు. దేవి ముఖము గంభీరముగా నున్నది. గర్భాలయమునకు చేరువలో శ్రీ శంకరాచార్యులవారు నెలకొల్పిన శ్రీ చక్రమున కనుదినము పూజలు జరుగుచున్నవి. కామాక్షి దేవాలయమునకు వెనుక నున్న తీర్థమునందు ప్రజలెక్కువగ స్నానములు సేయుచురు.

ఇంకొక విశేషమేమనగ—లక్ష్మి పార్వతీ దేవతలు ఒకప్పుడు లక్ష్మి పార్వతీ దేవతలు "నా పెనిమిటి యెక్కువనగ - నా పెనిమిటి యెక్కువ" అని వాదులాడారు. వారిరువురకు తీర్పు చెప్ప నియమితురాలైన సరస్వతీదేవి "హరిహరులలో యెవరింతకు ముందెన్నడును విని యుండని క్రొత్త కథ చెప్పుదురో వారధికు"లని నియమింపగా వారు లిద్దరు సరేనని యొప్పుకున్నారు. కథ చెప్పుటకుం దగిన స్థలము కూడ నిర్ణయింపబడింది. యెవరి యిండ్లకు వారు వెళ్ళిపోయారు.

లక్ష్మిదేవి పట్టుదల వలన మహావిష్ణువు శంకర సన్నిధియందున్న సంగమేయుండను పరిచారకుని రహస్యముగా పిలిచి, "నీవు పార్వతికి పరమేశ్వరుడు చెప్పెడి కథలను చాటున నుండి విని వెనువెంటనే వచ్చి ఇందిరకు చెప్పవలయు" నని మొగమాట పెట్టినందున నాతడట్లె చేయబూనాడు.

ప్రతిదినము శంకరుడు గౌరికొక కథ చెప్పుటయు - దానినా పార్వతి వేదికమీద సగము కథ చెప్పునంతలో లక్ష్మందుకొని "ఓస్! యిదియేనా!" అని మిగిలిన కథనంతయు పూర్తిచేయుటయు కాగ ముప్పదిరెండు దినములు గడచినై. పార్వతి ప్రయత్నములు ఫలించుటలేదు. శంకరుడు దివ్యదృష్టితో చూచి సంగమేయుని నాడు కైలాసమున నుండనీయక దూరముగా పంపిన పిదప పార్వతికింకొక క్రొత్త కథ చెప్పాడు. ఆ దినమున సంగమేయుని సాయము పొందలేక పోయిన యిందిర పందెము నందోడిపోక తప్పలేదు.

కాత్యాయని తను నింతకాలము వంచించిన నారాయణుని సంగమేయునని గూడ "మీరు మానవులై భూలోకమున బుట్టు"డని శపించింది. అందున నారాయణుండు వ్యాస భగవానుడై యవతరించి భారత భాగవత పురాణములను రచించాడు. నాటి ముప్పది రెండు కథలు బృహత్కథామంజరి యను పేరును ప్రసిద్ధికెక్కింది. కపటముగ సంచరించిన లక్ష్మీదేవియు ఆమె కనుకూలముగ సంచరించిన సరస్వతియుగూడ పార్వతి కిచ్చుట వింజామరలు వీచుచున్న దృశ్యము "ఏలాంకాంబ"యని చెప్పబడుచున్నది.

నాయనలారా! ఈ కాంచీపురము నందలి విశ్వబ్రాహ్మణ వీధిలో నొక కామాక్షి దేవాలయమున్నది. ఆ యమ్మవారి పాదముల క్రింద మూడు తలలు కనపడుచున్నవి. అవి ధర్మపాలుని కుమారులు. నిరంతరం కామాక్షి పాదపూజా దురంధరులైన రుద్రసేన, వీరసేన, భద్రసేనులవారి తలలు. వానిని గురించిన కథ కలదు.

## ధర్మపాల చరిత్రము

మాళవదేశ మందలి కళ్యాణపురమున ధర్మపాలు డను పేరుగల విశ్వవర్మ బ్రాహ్మణుడున్నాడు. వానికి నలుగురు కుమారులు. నిత్య శివపూజా నిరతులైన వారు ప్రతి శుక్రవారము కామాక్షి దేవి పూజచేయు దీక్షగలవారు. వారు వేద వేదాంగములు చదివిన పండితులు. పంచశిల్పాచార్యులు. కంచు ఇత్తడి పాత్రలు గొప్ప పనితనముగ నిర్మించి బంగారముతో సమానముగ విక్రయించుచున్నారు. వారొక సమతలంబున వ్యాపారమునకై కాంచీపురము పోవుట తటస్థించింది.

కాంచీపురము నేలు రాజుగారి కుమారి కోరినందున మంత్రిసూరన ధర్మపాలుని యంగడిలోని కంచు దర్పణముల రెండింటిని కొని వాని మూల్యమునీయక

నిరాకరించాడు, రాజుయు మంత్రి చేసిన దుర్బోధలాలకించి శిల్పకుమారులను పరాభవించినందున యుభయులకు భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ పోరాటంలో కామాక్షిదేవి యనుగ్రహం కలిగిన శిల్పి బ్రాహ్మణులే రాజు సైన్యములను చంపగలిగారు. చోళాంగునికి చిన్నతనమయింది—చిన్నతనంతోబాటు చింత కూడా పట్టుకుంది.

మంత్రి కపటం పన్ని అతి వినయం చూపి క్షమాపణలుగోరి"రాజుగారు మిమ్ము సత్కరింప పిలుచుచున్నా"రని నమ్మించి శిల్పి కుమారులను ముగ్గురను రాజభవనంబునకు గొనిపోయిన తరువాత వారిని కుత్తుకులలోతు దీసిన గోతులలో పూడ్చిపెట్టి తలలు నరికించారు. ఆ శిరములు నేలమీద పడక ఎగిరిపోయి గగన మార్గమున దిరుగాడుచు తండ్రిగారిని పిలిచినై. ఆ భయంకర దృశ్యము చూచిన ధర్మపాలుడు కామాక్షి దేవాలయమునకు బోయి"యిదియేమి యన్యాయముతల్లి!" అని వాపోయాడు. కామాక్షిదేవి కోపంతో చూచినంతనే మంటలుపుట్టి నగరమంతా గాల్చివేయు పరిస్థితి సంభవించింది. చోళాంగ మహారాజు తన పరివారంతో గూడ వచ్చి ధర్మపాలుని పాదాలమీద బడ్డాడు.

ధర్మపాలుని ప్రార్థన మన్నించిన కామాక్షిదేవి మంటల చల్లారచేసింది. ఆమె తెప్పించిన పళ్ళెములోనికి రుద్రసేనాదుల తలలు వచ్చి నిలచినై. రాజ కోటలో నరికి వేయబడిన శిల్పకుమారులకు దేవి సంకల్పమున తలలువచ్చి వారు లేచి వచ్చారు. పళ్ళెరమందున్న తలలు దేవి పాదములక్రింద వెలసినై. నేటికిని యీయమ్మ వారి పాదములక్రింద మనకామూడుతలలు దృష్టాంతరముగా కనపడు చున్నది.

ఈ మూడు తలలు పాదముల క్రింద నున్న కామాక్షిదేవి చాలచోట్ల మహామాయాదేవిగా వేంచేసి యున్నది. మహామహిమగల మహామ్మాయి దేవాలయము లెక్కువగా తెలంగాణాకు చెందిన పోచంపాడు, మంగళంపల్లి, పెద్దకళ్ళే

పల్లి, సిద్దిపేట మొదలైన గ్రామాలలో వెలసియున్నవి, నెల్లూరు మండలానికి చెందిన కందుకూరు నందును యాతలమ్మ విగ్రహమునకు పాదముల క్రింద నీ మూడు తలలు కనపడుచున్నవని యెరింగించాడు.

నాయనలారా! పూర్వమొకప్పుడు లక్ష్మీదేవి యీ ప్రపంచమునకంతకు నేనే ముఖ్యమైనదాననగ సరస్వతియు నేనే ముఖ్యమైనదానినని వాదమాడింది. ఆ విషయం తెలిసిన బ్రహ్మదేవుడు సరస్వతిని మందలించి నీవెంతచదువరివైనను లక్ష్మి ధనవంతురాలుగద. కవులు పండితులు శ్రీమంతులను యాచింపవలచినవారే" నని పలికినందున సరస్వతి భర్తమీదను అలిగి సముద్రమందు కలిసిపోయింది. భార్య తనచెంత లేనందున బ్రహ్మదేవుడు విచారగ్రస్తుడై యుండగ ఆకాశవాణి "విధాతా నీవు సత్యవ్రతక్షేత్రమును కాంచీపురమునందు వేయి అశ్వమేధయాగములు చేసినచో నీకీ చిత్తచాంచల్యము తీరగలదని హితబోధ చేసింది.

చతుర్ముఖుడు సంతసించి కాంచీపురమునందు యజ్ఞంచేయ ప్రారంభించాడు. ఆ యజ్ఞానికి సర్వలోకములనుండి మునులు దేవతలంతా వచ్చారు. వశిష్ఠ మహాముని స్వయముగపోయి సరస్వతిని భర్తదగ్గరకు రమ్మని పిలిచాడు. కాని ఆమె నిరాకరించింది. అంత పరమేష్ఠి సూర్యదేవుని పుత్రికయైన సావిత్రిని ధర్మపత్నిగ స్వీకరించి-ఆమెను తన వెంటనుండగ యజ్ఞంచేయ మొదలుపెట్టాడు.

ఆ యజ్ఞ సమయంలో దేవతలకు జరుగుచున్న మర్యాదలు తమకు జరుగుట లేదని గొడవలు పెంచుకొన్న రాక్షసులు వెడలిపోయిన తరువాత సరస్వతిని ప్రసన్నురాలిని చేసికొని "అమ్మా! నీ పెనిమిటి నీవుగాక యింకొక స్త్రీని నీ స్థానము నందుంచుకొని సవనము సేయుట మీకంగీకారములే"దని మాటాడినందున వారు మమ్మ సభనుండి లేచిపొండని పరాభవించారు. "ఇంత యన్యాయమెందైన నున్నదా, ఐన యీ సమయంబున,చేతగాని వానినట్లు దూరముగా పడియుండక

నీ గౌరవము నిల్పుకొను"మని చెప్పుటకే మేము వచ్చినారమని వాడీలు చెప్పారు.

చెప్పుడు మాటలాలకించిన సరస్వతిని సహ్యాద్రి మీదికెక్కి అక్కడ నుండి నదీరూపమున భయంకర ఘోష చేయుచు యజ్ఞశాల చెంతకు పరుగిడి వచ్చుచున్నందున్న వారందరెటు వారటు పారిపోయారు. నారాయణమూర్తి మాత్రము ధైర్యంతో నదికడ్డముగ శయనించాడు. మహావిష్ణువునుచూచి సరస్వతి బిడియపడి వెగవతియను చోటున రెండు పాయలుగ చీలింది. తరువాత వానినుండి కలిగిన యుపచీలికలె స్రంప కంప శుక్తిక కనక అసమంజస చండవేగయను నామముల ధరించింది. అటుపిమ్మట సరస్వతినే కళత్ర స్థానమునందుంచుకొని మిగిలిన యజ్ఞములు బ్రహ్మ పూర్తిచేశాడు. శ్రీమన్నారాయణుండు సరస్వతి బ్రహ్మలకు ప్రత్యక్షమై "మీరు యజ్ఞమొనరించిన యీ పుణ్యస్థలము నందే నేను వరదుడనై యుండు"నని వరమిచ్చాడు.

అటులనే రమా రమణుండు కాంచీ క్షేత్రమున వరదరాజ స్వామి నామముధరించి దేవేరియైన పేరిందేవి తాయారుతో గూడ వేంచేసియున్నాడు. ఆ దేవున కానాటినుండి యీనాటి వరకును దినపూజ, పక్షపూజ, మాసపూజలే కాక సాంవత్సరికోత్సవము లతివైభవముగ జరుగుచున్నవి. వివిధ వాహనాలంకార ములతోను, సూర్య చంద్ర ప్రభలతోను, జరుగుచున్న వైభవములు వర్ణనాతీత ములు, ముక్తిప్రదములైన అయోధ్య మధుర మాయా కాశి కంచి అవంతిద్వారం యను క్షేత్రము లేడింటిలోను యీ కాంచి కగ్రస్థానము లభించింది.

ఇందు పదునెనిమిది విష్ణ్వాలయములు-నూట నాలుగు శివాలయములు-యిరువనొక్క తీర్థములు-పరాశబిలము, మామిడిచెట్టు పెద్ద పుట్ట మున్నగున

వెన్నియో ప్రఖ్యాతిగాంచినవని వివరించిన సదానంద యోగి మరుదినమున ప్రయాణం సాగించిపోయి పక్షితీర్థంలో మజిలీ చేశాడు.

## పక్షితీర్థం క్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ పక్షితీర్థమను స్థలము చెంగల్పట్టునందున్నది. కృత యుగము నందొకప్పుడు సర్వసంగ పరిత్యాగులు-జితేంద్రియములునైన యెనిమిది మంది మహామునులకు ప్రపంచ భోగముల ననుభవింపకోర్కె కలిగి ఈకొండమీద తపమాచరింపగ పరమశివుడు ప్రత్యక్షమై "మీకేమి కావలయు"నని యడిగారు. మునులంతట నిజమును చెప్పలేక తటనటాయించుచు "మాకు మీ సేవయే కావలయు"నన్నారు. కాని సాంబశివమూర్తి వారి మనసులోని మమకారము గ్రహించి నందున "యోగేంద్రులారా! నేను మీ నిజసంకల్పము తెలిసికొంటిని. మీ యెనమండుగురును యెనిమిది పక్షులై జన్మింపుడు. ఒక్కొక్కయుగమునందిద్దరు రెండుపక్షుల చొప్పున ప్రతిదినము గంగాస్నానము చేసివచ్చి నా ప్రసాదమును తినిపోవుచుండుము. ఆ తరువాత జన్మమున మీరు మోక్షం నొందగల"రని తెలిపి యదృశ్యుడయ్యాడు.

శంకరునిచే నాజ్ఞాపింపబడిన యామునులే కృతయుగంబున పూషవిధాత లను పేరుగల పక్షులయ్యారు. త్రేతాయుగమున సాంపది జటాయువులను పేరుగల పక్షులయ్యారు. ద్వాపర యుగమున శంభుగుప్త మహాగుప్తులను పేరుగల పక్షు లయ్యారు. ఈ కలియుగమున శంబర శంబరాదులను పేరుగల పక్షులై ప్రతి దిన మును గంగాస్నానముచేసి ఇచ్చటకు వచ్చిపోవుచున్నారు.

యాత్రికులు ఉదయం కాలకృత్యముల దీర్చుకొనిన తరువాత పక్షి తీర్థంలో సుస్నాతలై కొండనెక్కిపోయి స్వాములవారికి పండ్లు, పూలు కర్పూర ములు సమర్పించిన కొంతసేపటికి దేవాలయమునకు సంబంధించిన పక్షి పండారం వారు వచ్చి భక్తాదులిచ్చిన విరాళములను సేకరించి చక్కెర పొంగలి కలశమును ఘృత పాత్రలను వెంటగొనివచ్చి స్వామివారికి కైంకర్యముచేసి పూజావిధానము

ముగించెదరు. తరువాత పూజారు లోపల వేదికమీదను - యాత్రికులు వేరుగను కూర్చొని యుండ రెండు రెండు యామములగునప్పటికి గగన మార్గమునుండి రెండు పక్షులువచ్చి; వాని కీయబడిన పొంగలిని తిని-నేతిని తాగి; తిరిగిపోవును. అనంతరము నా ప్రసాదము సందరకు పంచిపెట్టుదురు.

ప్రతి పంద్రెండేండ్లకొక పర్యాయము ఈ వేదగిరియందున్న ఇంకొక దివ్యస్థలం. రుద్రకోటీశ్వర క్షేత్రము. అచట వింతలు జరుగుచుండుటయు సంప్రదాయము. దేవాలయ పెత్తనపుదారికి మొదట స్వప్నమగును. మరు దినంబు నందొక మంచి ధ్వని వినబడును. అంతట నా యధికారి శంఖ తీర్థములో స్నాన మొనరించివచ్చి పరిసరంబులందు వెదుకుచుండగ వారికొక మహాశంఖంకనబడును. వారా శంఖమును భక్తి శ్రద్ధలతో నెత్తి బంగారుతొట్టి యందుంచి కొండమీద వేదగిరీశ్వరస్వామి సన్నిధికి మహోత్సవంలో తీసికొనిపోయి స్వామిముందుంచి పూజించెదరు. ఇంతకు పూర్వమున్న శంఖముతో నిక పనియుండదు. కనుక వెనుకటి శంఖములన్నియు దేవాలయమునందు గుట్టబడియున్నవి.

పూర్వము చొక్కమ్మ యను కన్య నిచట తపసుచేసి, ప్రసన్నుడైన యీ రుద్రకోటీశ్వరునే వివాహమాడి ఈ వేదగిరిమీద కాపురమున్నదని, అందులకు కోపించి త్రిపుర సుందరీదేవి ఈ కొండదిగి వచ్చినదనియు, స్వాములవా రంతట నొకభక్తుని దేవిచెంత తోడుండమని నియమించి వారు మాత్రము ప్రతి దినము త్రిపురసుందరి దగ్గరకువచ్చి పోవుచుందురను నొక కథ వినబడుచున్నది. అట్లు అమ్మవారి దగ్గరకు వచ్చిన స్వామియే దిగువ తిరుపతియందలి పెద్దగుడిలో నున్న భక్తవత్సలేశ్వరుండని ప్రసిద్ధి కెక్కినట్లును, చొక్కమ్మ చొక్కనాయకి యైనదనియు తెలియుచున్నది.

ప్రతి చైత్రమాసమున స్వామికి బ్రహ్మోత్సవములు జరుగుచున్నవి. ఆ సందర్భమున దేవతామూర్తులన్నింటిని వేదగిరిచుట్టూ నూరేగింపు చేయించు దురు. వేదగిరిమీద సంజీవి మొదలైన దివ్యౌషదు లున్నవని నమ్మి వర్షా కాలమునందా చెట్లపైబడిన నీటిచే నేలయు పవిత్రమైనదని చాలామంది నమ్ము చున్నట్లు వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి చిదంబరలో మజిలీ చేశాడు.

## చిదంబర క్షేత్ర మజిలి

నాయనలారా! చిదంబర మొక గొప్ప శివక్షేత్రము. ఇచ్చట నటరాజ స్వామి ముఖ్యదైవము. చిదంబరమునకు సమీపము నందున్న పల్లె గ్రామంబున నందుడను పంచమ బాలుడున్నాడు. వానికి నటరాజమీద మొదటినుండి భక్తి శ్రద్ధలెక్కువ. అది తెలిసికొనలేనివారు నందునికి పిచ్చి పట్టినదన్నారు. నందు డెంత స్వామిని చూడాలని తహతహలాడినా యజమాని వానిని చిదంబరం పంప డానికి ఇష్టపడలేదు.

చివరికెట్లో కాపుయనుమతి తీసికొని నందుడు చిదంబరం చేరుకున్నాడు. కాని కడజాతి వాడైనందున వానిని దేవాలయంలోనికి రాకుండా పూజారు లటకా యించారు. ఐనా దూరాన నిలువంబడిన నందుడు జనంలోనుండి తొంగి చూచు చున్నాడు. వాని భక్తి కానందించిన నటరాజు తన కెదురుగనున్న నందీశ్వరుని కొంచెం ప్రక్కకొదుగుమన్నాడట. నేటికి ప్రక్కకొదిగిన నంది మనకక్కడ కనబడుతూంది. ఆ రాత్రి నటరాజస్వామి పూజారుల కలలో కనబడి "నా భక్తుని తీసుకురండి" అని చెప్పాడు. మరునాటి యుదయ మా బ్రాహ్మణులు నందుని చేరి "అబ్బాయీ! నిన్ను స్వామి దర్శనానికి తీసుకుపోవచ్చాం. కానీ ఇలా

కాకుండ పవిత్రమైన అగ్నిలో ప్రవేశించిరావడం మంచి" దన్నారు. నందుడందులకైనా సరేనని నిప్పుల కుండంలో దూకి కొంతసేపటికి విభూతి రేఖలు; పట్టుబట్టలతో శివమూర్తిలా వెలుపలకువచ్చి నిలబడ్డాడు. దేవాలయాధికారులంతట నందుని క్షమాపణలు వేడుకొని నటరాజ సన్నిధికి తీసుకొనిపోయారు. ఇది మహాభక్త నందుని కథ.

ఆలయమున నటరాజస్వామి దర్శనమిచ్చుచున్నాడు. వారి దేవేరియైన శివకామ సుందరీదేవి బంగారు ప్రతిమయై భైరవంక క్రీగంట చూచుచున్నది. దంపతులిద్దరూ దక్షిణాభిముఖులై యున్నారు. అమ్మవారికి తూర్పున స్వర్ణ భైరవస్వామి వేంచేసి యున్నాడు. దేవాలయంబున కైదు ప్రాకారములు. వెలుపలి ప్రాకారంబునకు నాలుగువైపుల నాలుగు గోపురములున్నవి.

ఐదు ప్రాకారములలోను వరుస క్రమముగ చిత్సభ–కనకసభ రాజసభ–నర్తకసభ–దేవసభ లున్నవి. మొదటిదైన చిత్సభయందు కామసుందరీ సమేతంబుగ చిదంబర తాండవమూర్తి నెలకొనియున్నాడు. రెండవదైన కనక సభయందు నిత్యారాధనలు జరుగుచున్నవి. మూడవదైన రాజసభయందు వేయి నాళ్ళ మంటపమున్నది. నాల్గవదైన నర్తక సభయందు ఊర్ధ్వతాండవేశ్వరులై యున్నారు. ఐదవదైన దేవసభయందు వినాయకుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు శివానంద నాయకుడు కుమారస్వామి భిక్షాటన శివమూర్తి మున్నుగాగల దేవశిల్పములున్నవి.

మూల విగ్రహములకు పడమరోత్తరములందు పరజాలు కట్టబడి యున్నవి. ఆ తెరవెనుక నేమున్నది? ఏమి జరుగుచున్న దెవరికిని తెలియవు. కనుకనే మనలో చిదంబరహస్యములను వాక్యము పరిపాటియైనది. ఈక్షేత్రమున శివగంగా తీర్థము, గుహ్యాతీర్థము, పరమానందతీర్థము, వ్యాఘ్రతీర్థము, నాగ తీర్థము, యావన తీర్థము, క్షీరాబ్ధి తీర్థము, బ్రహ్మ తీర్థము, శివతీర్థము లనునవి నది తీర్థములు ప్రశస్తములు.

కాంచి యందున్న యేకామ్రేశ్వర పృధ్వీలింగము. జంబుకేశ్వర ముందున్న జంబుకేశ్వర అగ్నిలింగము తిరుణామల యందున్న అరుణాచలేశ్వర తేజోలింగము కాళహస్తి యందున్న శ్రీ కాళహస్తీశ్వర వాయులింగములవలెనే ఈ చిదంబరమందున్న చిదంబరేశ్వరకాశ లింగము ప్రసిద్ధి గాంచినందున ఈ క్షేత్రమును పుండరీక పురమనియు వ్యాఘ్రపురమనియు బిల్వవనమనియు చెప్పు చున్నారని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి చియ్యాళిలో మజిలీ చేశాడు.

## చియ్యాళి క్షేత్ర మజిలీ

నాయనరారా! ఈ చియ్యాళియందు వేంచేసియున్న దైవము బ్రహ్మ పురీశ్వరము. వీరి సతీమణియైన త్రిపుర సుందరీదేవి మరియొక కోవెలయందు వేంచేసి యున్నారు. దేవాలయమునకు చేరువలో బ్రహ్మతీర్థ కుండమున్నది. దేవళమును చుట్టూ లింగములు—మందిరములు-భక్తుల ప్రతిమము లనేకముగా నున్నవి. యాత్రికులకు కావలసిన పూజా ద్రవ్యములుగాని - యితర వస్తువులు గాని దేవాలయములోనే విక్రయించుచున్నారు.

ప్రధానాలయమునకు దగ్గరలో నొక పెద్దగుడి యున్నది. అచటినుండి సోపానముల మీదుగనెక్కి దక్షిణముగా పోయినచో యెత్తయిన పార్వతీ పర మేశ్వర విగ్రహములు తూర్పుముఖముగ వెలసియున్నవి. ఆ పురాణదంపతులను చుట్టుకొని పరివారమున్నారు. అందుండి మరికొన్ని మెట్లనెక్కి పడమరగపోయి నచో శరనాధస్వామి కన్పించును. పూర్వమీ శరనాధుని గాంభీర్యమును చూడ లేక బ్రహ్మాది దేవతలు ప్రార్థించినందున నా దేవుడు దిగంబరియై ప్రశాంత వదనుండయ్యెనని చెప్పుదురు. ఈ మూర్తికి శుక్రవారములందు పునుగు జవ్వాజి మొదలగు సుగంధ ద్రవ్యములతో అభిషేకములు, అలంకారములు, భోగములు చేయబడుచున్నవి.

మరియు నిచటకు సమీపము నందే వైద్యనాథమున్నది. ఆలయము నందీ వైద్యనాథులు పడమర ముఖంబునకు, బాలాంబికా అమ్మవారు దక్షిణ ముఖంబునను నిలిచియున్నారు. చేరువలోనే రామలక్ష్మణులు జటాయువునకు దహన సంస్కారములు గావించిన త్రేతాయుగము నాటికుండమున్నది. ప్రధానాలయంబునకు మూడు ప్రాకారములున్నవి. రెండు ప్రాకార మందంతటను మందిరము లున్నవి. వెలుపలి ప్రాకారమున నాలుగు గోపురములున్నవి. అచటనే సిద్ధామృత కుండమున్నది. అందలి జలము సేవించినవారికి దీర్ఘాయురారోగ్యాలు కలుగుచున్నందుననే యిచ్చటి కుండమునకు సిద్ధామృత కుండమనియు ప్రముఖ దైవమునకు వైద్యనాథస్వామి యనియు సార్థకనామము లేర్పడినై. ఇచటి కుమారస్వామికి కార్తికమాసములో కృత్తికానక్షత్ర పుణ్యకాలమున ప్రత్యేకముగ గొప్ప వైభవములు జరుగుచున్నవి.

అచటికి మరికొంత దూరమున మయూర క్షేత్రమున్నది. ఈ శివ క్షేత్రము కూడ కావేరినది శాఖకు దక్షిణమునందు యున్నది. అందున్న మయూరేశ్వరుండును స్వయంభూ లింగమనియే చెప్పబడుచున్నది. స్వామి ననుసరించి దేవేరియైన అభయాంబికాదేవి- గణపతి- కుమారస్వామి- సభాపతి మొదలయిన వారలకు గూడ కోవెల లమరియున్నవి. వారికి పూజాది వేడుకలు జరుగుచున్నవి.

అటులనే కావేరి శాఖకు నుత్తరముగనున్న తిరువందళూరునందు శ్రీ పరిమళరంగనాయకస్వామి వేంచేసియున్నాడు. నాలుగు భుజములు, తలయందు సూర్యబింబము, నాభికమలమున చతురాననుడు, చరణములందే చంద్రులున్న యీ మూర్తి సుందరముగ నున్నది. అందెయున్న భూదేవి కావేరి గంగా ప్రతిమలు శోభగలవి. అచటను వేడుకలు విధివిధానంబుగ జరుగుచున్నవని వివరించిన

సదానందయోగి మరు దినంబున ప్రయాణము సాగించిపోయి రాజమన్నారులో మజిలీ చేశాడు.

## రాజమన్నారు క్షేత్ర మజిలీ

నాయనలారా! పూర్వ మీ క్షేత్రమున గోఖిల మహాముని చాలాకాలం తపసు సేయగ శ్రీకృష్ణ భగవానుడు దర్శనమిచ్చి "మహామునీ! నీకేమి వరము కావలయు"నని యడిగాడు. గోఖిలుడంతట దేవదేవుని యభినందించి తరువాత "మహాత్మా! నేను తపమాచరించినదియు, మీరు నాకు దర్శనంబిచ్చినదియునైన ఈ ప్రదేశము దివ్యస్థలమై భక్తజన పాలనార్థము మీకిందే స్థిరనివాసంబుగనుండుటయే నాకు కావలయు"ననగ వాసుదేవుడు సంతసించి "వత్సా! నీవు కోరినటులనే నేనిచోట సంతాన గోపాలస్వామి నను పేరున నిలిచియుందును. ఈ క్షేత్రము ముందిక మీదట చంపక వనమనియు దక్షిణద్వారకాపుర మనియు ప్రశస్తినొందగల"దని చెప్పి యదృశ్యమయ్యాడు.

నేడా స్థలము మంగళపు స్టేషనుకు నుత్తరమున నాలుగు క్రోసుల దూరములో వెలుగొందుచున్నది. దానినిపుడు రాజమన్నారు గుడి క్షేత్రమనియు చెప్పుచున్నారు. ఇచట పంచభైరవులు ఆళ్వారులను వేంచేసియున్నారు. ఈ స్థానమునకు దక్షిణముగ శేషవటపత్రసాయి కిరువైపులందు భూదేవి,శ్రీదేవియు నున్నారు. మూర్తులకు విలువైన యలంకారము లున్నవి.

ఇందలి హరిద్రాతీర్థము, శంఖుతీర్థము, చక్రతీర్థము, క్షీరుబ్ధితీర్థము, గోపీనాథ తీర్థము, అగ్నితీర్థము, లక్ష్మీతీర్థము, కృష్ణతీర్థము,గజేంద్రమోక్షతీర్థము లన్నింటిలో మొదలైన హరిద్రాతీర్థము ముఖ్యమైనది. ఇచ్చట ఎత్తయిన గోపురములు మనోహరముగ రూపొందినవి. మందిరంలో రాజమన్నారుస్వామి చంపక లక్ష్మి మున్నగు దేవతలున్నారు. సంతాన గోపాలదేవునకు వెండి రథమున్నది. ఆ స్వామి విగ్రహము నెత్తుకొని ప్రార్థించి ఆరాధించిన వారికి సంతానము

కలుగుచున్నదని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించి పోయి కమలాలయంలో మజిలీ చేశాడు.

## కమలాలయ క్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ కమలాలయమైన శ్రీ వాల్మీకస్వామి ప్రధాన దైవము. పూర్వము దేవ దానవులకు జరిగిన యుద్ధంలో ముచికుంద మహారాజు దేవేంద్రునకు సాయంచేశాడు. దేవతలకు విజయం లభించింది. దేవేంద్రుడంతట ముచికుందుని గౌరవముగ స్వర్గమునకు తీసికొనిపోయి "రాజా! నీ యుపకారమువలన మేము మేలు పొందితిమి. నా వలన నీకేమి ప్రత్యుపకారము కావలయునో కోరుకొను" మనగ ముచికుందుడు "శచీపతి నాకితర సంపద లక్కరలేదు, నీ పూజ యందుంచబడిన త్యాగరాయస్వామి విగ్రహము నిచ్చినచా" లన్నాడు.

ముచికుందు డడిగిన దానిని కాదనలేక, పూజయందున్న దాని నీయలేకను సంకటంబుపడిన ఇంద్రుడు మరికొన్ని విగ్రహములట్టివే చేయించి యందు నీకు కావలసిన దానిని తీసుకొను మనవి రాజేంద్రుడొకదానిని తీసుకొనిపోయాడు. ముచికుందుని స్వప్నమున నారేయి త్యాగరాజస్వామి కనబడి "నరపాలా! నీవు తెచ్చినది నిజమైన పూజలోని ప్రతిమ కా"దని చెప్పినందున నాతండు మరునాడు దేవేంద్రుని యొద్దకుపోయి "ఇదికాదు. నాకు నీ పూజయందున్న బొమ్మయే కావల"నన్నాడు. పురందరు డేమియు ననలేక విగ్రహంబుల నన్నింటిని రాజుకే యిచ్చి పంపించాడు.

ముచికుందుడంతట వానిని భూలోకమునకు గొనివచ్చి దేవేంద్రుని పూజ యందుంచబడిన ప్రథమ లింగమునీ తిరువాలూరునందు ప్రతిష్ఠ గావించిన పిదప వానిని తిరువాంబూరు తిరుక్కోవిల తిరువల్లూరు తిరుక్కాయరు తిరుమలక్కాడు వేదారణ్యము లనుచోట్ల స్థాపనచేశాడు. ఈ క్షేత్రములన్నియు మొదట తిరువాలూరునకు చుట్టుపక్కలనున్నది. తిరువట్టూరనం బడుచున్న తిరుమల

క్కాడు చెన్నపురికి యుత్తరమున నైదుమైళ్ళ దూరమున నున్నది. తిరువావూరులో దేవార్చితమైన త్యాగరాజమూర్తినే వల్మీకేశ్వరుం డనుచున్నారు.

పూర్వ మొకానొక సమయంబున దుర్వాస మహాముని చేసిన ఘోర తపసున కానందించి త్యాగరాజస్వామి వల్మీకము నుండి సాక్షాత్కరించినందున నాదేవునకు వల్మీకేశ్వరుండను పేరువచ్చింది. దానికి చేరువయందే దుర్వాసముని సమాధియు కలదు. ఈ క్షేత్రమందలి స్వాములవారి తీర్థ ప్రసాదంబులకెట్టి కట్టుబాటులు లేవు. స్వామికి వార్షికాదాయములు రాగల సదుపాయంబులున్నవి. ఇచటి కీశాన్యము నందొక క్రోసు దూరములోని హాటక క్షేత్రమందు శ్రీరామునిచే పూజించబడిన అన్నపూర్ణా విశ్వనాథమూర్తులు గణపతి, కుమారస్వామి, చండికేశ్వర మూర్తులున్నవి. దేవాలయ మండపములో శ్రీరుద్ర పాదములు శ్రీరామ పాదములు కన్పట్టుచున్నవి. యాత్రికు లిచట పిండములు వేయుదురు. పుర బాహ్య ప్రదేశమున హనుమత్సమేత సీతారామ లక్ష్మణాలయ మున్నది.

హాటక క్షేత్రమండలి అన్నపూర్ణా విశ్వనాథ విగ్రహము లొక చోళ రాజ ప్రతిష్ఠలట, రాజుగారి ఆలమందలోని యొకావు పొదుగున పాలెన్నడును కనరాక నుండుటచే, రాజా కారణ మేమియో తెలిసికొన నొక దినంబున గసవు మేయ వచ్చిన గోవును వెంబడించెనట. ఆవు దూరముగా బోయి పుట్టమీద నిల్చి పొదుగులోని పాల నందు విడచుట గాంచుటం జూసి రేడా పుట్టను త్రవ్వించి చూచుటయు, భూమియందె అన్నపూర్ణా విశ్వనాథ విగ్రహంబులు కన్పించుటయు జరిగినందున చోళరాజా మూర్తుల కాలయము నిర్మించి పోషణ సౌకర్యముల కల్పించెననియు దెలియుచున్నది. ఆవు పాలు పిండబడిన పుట్టగల చోటునందే క్షీర పుష్కరిణి యేర్పడినదనియు క్షేత్ర పురాణములు చెప్పబడుచున్నవి. క్షీర పుష్కరిణి యందు గంగ యమున సరస్వతి గోదావరి కృష్ణ తుంగభద్ర కావేరి తామ్రపల్లి సరయూ నదుల మహాత్మ్యము కలదని ప్రతీతి.

కమలాలయ తీర్థము నందనేక మండపములు ఘట్టములు గలిగి మిగుల విశాలముగనున్నది. ఆదియందచోట సప్తఋషులు తపసు చేసినట్లును చెప్ప

చున్నారు, దేవాలయ ప్రాకారమున నూటెనిమిది చిన్న చిన్న గుడులున్నవి. దేవళంబునకు మూడు ప్రాకారము, నాలుగు గోపురములున్నవి. మొదట ప్రాకారములో వేయిగాళ్ళ మండపమున్నదని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణము సాగించిపోయి కుంభకోణంలో మజిలీ చేశారు.

## కుంభకోణం క్షేత్ర మజిలీ

నాయనలారా! ఈ కుంభకోణమున కుంభేశ్వర, నాగేశ్వర, సోమేశ్వర కాళహస్తీశ్వర, విశ్వేశ్వర, గౌరీశ్వర, అభిముక్తేశ్వర, బాణపురీశ్వరులను శివాలయంబు లెనిమిదియు, చక్రపాణి, వరాహస్వామి, శరనారాయణాది విష్ణ్వాలయములారు ప్రథమ శ్రేణికిచెందినవి. మంగళాంబికా సమేత కుంభకోణేశ్వరాలయము-సీతాసమేత రామాలయం-కోమలవల్లీ సమేత శార్ఙ్గపాణి దేవాలయం విజయవల్లీ సమేత చక్రపాణి దేవాలయం జ్ఞాన ప్రసూనాంబా సమేత నాగేశ్వరాలయం – సోమసుందరి సమేత సోమేశ్వరాలయం – బాలాంబా సమేత, బాణాపురీశ్వరాలయం – అద్భుతవల్లీ సమేత అవిముక్తీశ్వరాలయం – అన్నపూర్ణా సమేత కాశీవిశ్వేశ్వరాలయం అభయాంబా సమేత ఐరావతేశ్వరాలయం – త్రిపురసుందరీ సమేత గౌతమేశ్వరాలయములేగాక భూతవరాహస్వామి దేవాలయములు మొదలైన వెన్నియో కలవు.

పూర్వము చంద్రుడు తపసుచేసి శ్రీమన్నారాయణుని మెప్పించి "సకలైశ్వర్యములను ప్రసాదింపు"మని కోరగ రమారమణుండు శశితో "ఓయీ! సంపదల నీయదగిన లక్ష్మి యిపుడు నా చెంతలేదు. లోక కళ్యాణమునకై నేను దశావతారములు దాల్చుచున్న సమయంబున నామె వైకుంఠము నందొంటరిగ నుండలేక భూలోకమందలి కుంభకోణ క్షేత్రమునందు స్వర్ణ పంకజారణ్యమున మంగళాంబికా నామంబునచి నవతరిం యున్నది. ఇకమీద నేనునను కుంభకోణేశ్వరుండనై మంగళదేవత చెంతనే యుండబోవు చున్నాను.

లక్ష్మీదేవి యచట పరిశుద్ధాత్మతో తపసుచేసి నిర్మించిన లక్ష్మి సరోవరంబున మరణించినవారికి వైకుంఠము సిద్ధించుట యందనుమానములేదు. బ్రహ్మాది దేవతలు ప్రతి సంవత్సరమును వచ్చి లక్ష్మి సరోవరంబున పవిత్ర స్నానములుచేసి పోవుచున్నారు. క్షేత్రమున మూడురాత్రములు నిద్రించినవారికి బ్రహ్మలోక ప్రాప్తియగును. నీ వచ్చటకుపోయి అందు వెలసియున్న నా కుంభ కోణేశ్వరమూర్తి నారాధించితివేని నీ సంకల్పము తప్పక నెరవేరగలదని చెప్పి యదృశ్యమయ్యాడు.

చంద్రుడు కుంభకోణమునకు పోయి లక్ష్మిసరోవరంబున స్నానమాచరించి మంగళాంబికా కుంభకోణేశ్వరు నారాధించిన తరువాత వానికి సర్వసంపదలు లోక పూజితము. నవగ్రహ మండలమున స్థానములు ప్రాప్తించినవని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించిపోయి శ్రీరంగంలో మజిలీ చేశాడు.

## శ్రీరంగ క్షేత్ర మజిలీ

నాయనలారా! శ్రీరంగనాయకస్వామి నిలయమైన శ్రీరంగం మహా మహిమంబు గలది. ఆదియందు శ్రీరంగనాయకస్వామి వ్రతమును పూజించు కొనుటకు గాను నారాయణమూర్తి బ్రహ్మదేవుని కీయగా - బ్రహ్మ మనుచక్రవర్తి కీయగా - మను ఇక్ష్వాకుని కీయగా సూర్యవంశీయులనుండి శ్రీరామునకు సంక్రమించి-రామునినుండి విభీషణునకు లభించింది. విభీషణుడు దానిని లంకకు గొనిపోవుచుండగ దేవత లందు కంతరాయం కలిగించాలనుకున్నారు.

అయోధ్య నుండి లంకకు పయనించుచున్న విభీషణుడు ఉభయ కావేరీ నదుల మధ్యభాగమునకు చేరునంతలో సంధ్యాసమయమయింది. రంగనాయక

విగ్రహమును నేలమీద పెట్టరాదనియు, అటుల పెట్టినను తిరిగి పెకలించుట సాధ్యం కాదనియు వానికి తెలియును. అందువలన అటు యిటు చూచి సమీపం నందున్న యొక బ్రాహ్మణుని పిలిచి "అయ్యా! నేను సంధ్య ముగించుకొని వచ్చువరకు నీ వీ బొమ్మను పట్టుకొనుము. నీకు మంచి బహుమతిస్తా"నన్నాడు. ఆ మాయా బ్రాహ్మణుడు విభీషణుని మోసగించుటకే మారు రూపమున వచ్చిన వినాయకుడు కావున సమయం దొరికినదని లోలోన సంతసించుచు పైకి "అటులనే పట్టుకొందును. కాని నేను నిన్ను మూడు పర్యాయములు పిలుచునంతలో నీవు రావలయు" నన్నాడు. విభీషణు డందులకు సమ్మతించాడు.

ఆయన స్నానం చేయుచుండగనే మాయా బ్రాహ్మణుడు ముమ్మారు పిలిచి, రంగనాయకస్వామి ప్రతిమను భూమిమీద దించి వెళ్ళిపోయాడు. విభీషణుం డంత తొందర తొందరగ సంధ్యావందన క్రమం నెరవేర్చుకొని వచ్చి - యెంత బలముపయోగించి పెకలింప చూచినను విగ్రహ మందుండి కదలనైనా కదలలేదు. అంతట స్వామి ప్రత్యక్షమై "రావణానుజా! పూర్వమొకప్పుడు కావేరీనది నన్ను తపస్సుచే మెప్పించి "నన్ను గంగానది కన్నను మించి పవిత్రురాలినిగా జేయు" మని యడుగగా నేనామోదించి "కొలది దినములలో నేను నీ తీరమునందే వెలియుదును. అప్పుడది మహాక్షేత్రముకాగలదు. నీయందు స్నానపానదానములు చేయువారి జన్మజన్మాంతర పాపములు హరించు నట్లును, వారికి సకల సంపదలు కలుగునట్లును, అంత్యమునందు వారికి కైవల్యము సిద్ధించునట్లు కరుణించెదనుగాన నీ యభిమతం ఈడేరగల"దని వరమిచ్చి యుంటిని. ఇపుడా కార్యము నీ వలన నెరవేరినది. నీవిచటనే నన్ను సేవింపు"మని చెప్పి యదృశ్యమయ్యాడు.

తరువాత రంగనాయక భగవానుని కిచట నాలయ ప్రాకారములు రూపొందినవి. ప్రధానాలయమునకు నాలుగు శిఖరములమధ్య విమానము కలదు. స్వామి వేదికలాంటి యున్నత స్థానమున పడమరగ తలనుండి లంకవైపు చూచుచు శయనించి యున్నారు. ఆలయమునకు ప్రాకారములున్నవి. ప్రతి దిన

మిచట స్వాములవారు మేల్కొను వరకు వీణావాద్యము జరుగుచున్నది. సూర్యోదయ ప్రాంతమున పూజారులు కావేరీ తీర్థము తెచ్చెదరు. గుడి తలుపులు కొంచెంగానే తెరచి లోపలకు పోయినవారు స్వామికి అద్దముచూపి,దంతధావనము చేయించి, దీపారాధన చేసి, నవనీత నైవేద్యము చెల్లించి అలంకారము గావించిన పిదప తలుపులు పూర్తిగా తెరిపించి భక్తులకు రంగనాయకస్వామి వారి విశ్వరూప ప్రదర్శనము జేయింతురు.

మరికొంచెము సేపటికి పాలు, రొట్టె, వెన్న నివేదనల నిచ్చి - కొంత సేపటికి పొంగలి దోసెల విందు చేయించి-ఆ తరువాత రాజభోగం మనంబడు నూటేబది శేర్ల బియ్యముతో వండిన అన్నముశాకములు పప్పు క్షీరాన్నము పిండి వంటలు కైంకర్యం మొనరించి-ప్రత్యేకంగా క్షీరాన్న మహా నైవేద్యమును చెల్లించుచు దపాలవారీగా యాత్రికులకు ప్రసాద వినియోగమును గావించెదరు. స్వామివారు నిత్యము కస్తూరీ తిలకంబునే ధరించుచున్నారు.

ఆలయ మొదటి ప్రాకారమునందు ఉత్సవులు గరుత్మంతుడు విభీషణుడు మొదలగు వారున్నారు. రెండవ ప్రాకారము నందు విష్వక్సేనులు వెలసియున్నారు. తూర్పు భాగమునం దితడి పద్మమున్నది అటులనే యుత్తరము నందొక బావి కలదు. అందలి నీటిని స్వాములవారి సేవలందుపయోగించెదరు. నుయ్యి ప్రక్కగా యిత్తడి చక్రమున్నది. మూడవ ప్రాకారమునందు విజయ గంగాచొక్కనాదులు నెలకొనియున్నారు. వానికి ప్రదక్షిణములు జరుగుచున్నవి. నాల్గవ ప్రాకారమునందు స్వామి కభిముఖముగా హనుమంతుడు నిలిచి నమస్కరించుచున్నాడు. మరియు పౌన్నమామయు చంద్ర పుష్కరిణియందు నున్నవి. అందెందరో హిరణ్య శ్రార్ధము చేయుచుందురు. ఐదవ ప్రాకారము నందు వెయిగాళ్ళ మండపము, రంగనాయకీదేవి మందిరము, అళ్వారుల సన్నిధి మహా బలిపీఠము లున్నవి. బిల్వవృక్షమునకు దక్షిణంబున ముక్కోటి యేకాదశి పర్వదినము నుండి పదిరోజులు తెరచి యుంచెదరు. మిగిలిన ఆరవ, యేడవ, యెనిమిదవ ప్రాకారములలో వరుసగ ద్రావిడులు, పూజారి వైష్ణవులు, శూద్రులు నివ

సించి యున్నారని వివరించిన సదానందయోగి మరుదినంబున ప్రయాణం సాగించి పోయి సీతా రామేశ్వరంలో మజిలీ చేశాడు.

## రామేశ్వర క్షేత్ర మజిలీ

నాయనలారా! మనమిప్పటికి కాశీనుండి బయలుదేరి క్షేత్రములలో మజిలీలు సేయుచు చేరదలంచుకొనిన రామేశ్వరమునకు వచ్చితిమి. ఇక మీకు నేనీ రామేశ్వర చరిత్రను యిందున్న పుష్కరిణిలు వానినిగురించియు విపులముగ చెప్పెదను. దీనిని సీతారామేశ్వర మనియు చెప్పుదురు. సేతునిర్మాణ మెటులైనదో తెలిసికొనండి.

త్రేతాయుగమున దశరథ మహారాజు అయోధ్య రాజధానిగ కోసని రాజ్యమును పాలించాడు. దశరథునికి శ్రీరాముడు పెద్ద కుమారుడు. రాముల భార్య సీత. ఒకానొక కారణంబున శ్రీరామచంద్రుడు తండ్రిమాట కాపాడుటకుగాను దండకారణ్యములో నివసింపవలసి వచ్చింది. అప్పుడాయన భార్యయైన సీతయు, తమ్ముడయిన లక్ష్మణుడును రామునను సరించియే వున్నారు. వారు మువ్వురు పంచవటి ప్రాంతము నందొక పర్ణశాల నిర్మించుకొని అందులో కాపురమున్నారు.

దండకారణ్యం రాక్షసులది. దాని కధికారి లంకాధిపతియైన రావణేశ్వరుడు. రాముడు దండకారణ్యము నందున రాక్షసులను చంపాడు. రావణాసురుడు వచ్చి రామలక్ష్మణులు యింటలేని సమయాన మాయోపాయంచేసి సీతనెత్తుకొనిపోయి తనలంకలోని యశోకవన మందుంచాడు. ఇక్కడ రామలక్ష్మణులకు సీత జాడతెలియక అడవినంతా గాలించారు. చివరకు జటాయువను పక్షి ద్వారా వారికి కొంత విషయం తెలిసింది. రామలక్ష్మణులింకా ముందుకు పోయి ఋష్యమూక పర్వతం మీదనున్న సుగ్రీవుడనే వానరరాజుతో స్నేహంచేశాడు. సుగ్రీవునికంటె కూడ సుగ్రీవుని మేనల్లుడు - మంత్రియునైన హనుమంతుడు రామునికి నమ్మిన బంటయ్యాడు.

వాలి, సుగ్రీవులు కిష్కింధనేలు వానరరాజులు. వారిలో వాలి చాలాబల

వంతుడు. ఒకప్పుడు దుందుభియనే దానవునితో పోరాడుతూ ఋష్యమూకాద్రి గుహలోనికి పోయి కొన్ని నెలలదాకా బయటకురాలేదు. సుగ్రీవుడప్పుడు అన్న గుహలోనే చనిపోయాడని చెప్పి కిష్కింధకురాజై వాలిభార్య తారను తన వశం చేసుకొని సుఖంగా వున్నాడు. కాని వాలి నిజంగా చనిపోలేదు. గుహలోనే దుందుభిని చంపి వాని కళేబరాన్ని కాలితో తన్నాడు. అది పోయి ఒక మునీంద్రుని ముందు పడినందున నా ముని యీ శవము నిటు పడవేసినవాడెవడైనను కాని, ఇంకొకమారీ కొండమీదకువస్తే తలపగిలి మరణిస్తా"డని శపించాడు. అంతట వాలి తిరిగి యింటికిపోయి చూడగ తమ్ముడు సింహాసన మెక్కిన సంగతి తెలిసింది. వాలి కడుపు మండిపోయింది. వెంటనే సుగ్రీవుని జుట్టుబట్టి లాగి నాలుగు తన్ని మెడబెట్టి గెంటివేయడమే గాక తమ్ముని భార్య రుమ నపహరించాడు. సుగ్రీవు డేమీ చేయలేక యీ ఋష్యమూకాద్రిమీదికెక్కి కాలం గడుపుతున్నాడు. ఇంతలో వారికి రామలక్ష్మణులు తోడయ్యారు.

ఇపుడు రాముడు వాలిని చంపి సుగ్రీవుని భార్య రుమను తిరిగి సుగ్రీవున కిచ్చేలాగునను సుగ్రీవుడు తనబలగంతో రావణాదులను చంపి రాముని భార్య సీతను తిరిగి రామున కిచ్చేలాగున యొడంబడికలు జరిగినై. ఇచ్చిన మాట ప్రకారం శ్రీరాముడు వాలిని చంపడమేగాక సుగ్రీవుని కిష్కింధ రాజ్యానికి యెదురులేని రాజును చేశాడు. సుగ్రీవున కిప్పుడు తన భార్యయేకాకుండ అన్నగారి భార్య తార కూడ ప్రియురాలయింది. వాలి కొడుకు అంగదుడు అనుచరుడయ్యాడు.

మొదటి నిర్ణయం ప్రకారం సుగ్రీవుడింక తన వానర సైన్యంతోగూడ రామునికి తోడు చేయవలసిన వంతు మిగిలిపోయింది. దానికై సీతయున్నజాడ తెలిసికొని రావలసినదిగా నియమించి వానరులను నలుదిక్కులకు పంపించాడు. నూరు యోజనముల సముద్రమును గగన మార్గమునుదాటి లంకకు చేరుకున్న హనుమంతుడు సీతనుచూచి మాటాడి తిరిగివచ్చి రామునకా చల్లని వార్త వినిపించాడు. ఇపుడు రాముడు లక్ష్మణుడు సుగ్రీవుడు సుగ్రీవుని బలమంతా కలసి

లంకకు పోవలయునని సముద్రందాకా వచ్చారు. సముద్రం చాల లోతు పొడవు యున్నందున దిగిపోవడంగాని-యీది పోవడంగాని సాధ్యమయ్యేపని కాదు.

శ్రీరాముడు సముద్రుని దారి యీయమని యడిగాడు. సముద్రుడు పలుకలేదన్న మహోగ్రహంతో ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించి నీరింకిపోయేలా చేస్తానని గర్జించాడు. ఆ సమయంలో ప్రసన్నుడైన సముద్రుడు "రామచంద్రా! తొందరపడకుము. నీకార్యము నెరవేరుటకొక యుపాయంబు దెలిపెద. విశ్వకర్మ కుమారులైన నలనీలాచార్యులను సోదరులిద్దరున్నారు. వారు శిల్ప శాస్త్రమునందే గాక యుద్ధరంగమునందును అసాధారణ ప్రజ్ఞకలవారు. వారిసాయము కోరుము. సముద్రము మీదుగ వారధి నిర్మింతురు. మీరందరు క్షేమముగా లంకకు చేర వచ్చును. అంతేకాదు- నీలాచార్యుని నీ సేనకు నాయకత్వము వహింప జేయుము. నీకు జయంబగు"నని చెప్పాడు.

రాముని కోరిక నిరాకరింపని నలనీలులు వారధి నిర్మించారు. రాముడు లంకకుపోయి యుద్ధంలో రావణాదులను సంహరించి విజయవంతంగా తిరిగి యిక్కడకు వచ్చేటప్పటికి రామునకు రాక్షసులను చంపిన బ్రహ్మహత్యా పాతకం బున కంటిచూపు హరించిపోయింది. అందున రాముడిక్కడ లింగప్రతిష్ట చేసి శివునారాధించి మరల చూపును పొందగలిగాడు. ఆనాడు రామునిచే ప్రతిష్టచేయ బడిన లింగమే అమలింగేశ్వరుడని ప్రసిద్ధికెక్కి యున్నాడు. ఆ సమయంబున సీత, లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు మొదలైన వారంతా వారి వారి పేరులు మీదుగ లింగముల నిందు ప్రతిష్టలు చేశారు. అప్పుడనేక తీర్థములు రూపొందినవి. ఆ తీర్థము లన్నింటిలోను ధర్మ పుష్కరిణి తీర్థములు ప్రధాన మైనది.

## ధర్మపుష్కరిణి ప్రభావము

నాయనలారా! పూర్వము గాలవ మహాముని దక్షిణసముద్ర తీరమందలి క్షీరసరోవరంబునకు దగ్గరలో ధర్మపుష్కరిణీతీర్థము చెంత చిరకాలము తపమాచరింపగ శ్రీహరి ప్రత్యక్షమై "నీకేవరము కావలయు" నన్నాడు. గాలవుడంతట నాగశయనునకు నమస్కరించి "ఇందిరా రమణా! నేను సర్వదా మిమ్మెడబాయక నుండి మీ సేవ చేయుచుండునట్టి వరమి"మ్మని యర్థించాడు.

పద్మనాభుం డంత "గాలవా! చాలాకాలము నాడిక్కడ ధర్ముండను యోగి యొక తీర్థమును నిర్మించుకొని అందు స్నానాదులు సేయుచు తపో నియమంబు పాటించుచుండగ శంభుడు దర్శనం బొసగి భక్తుని యభిమతంబేమని యడిగాడు. ధర్ముడంతట "దేవా! నేను సదా మీ పరిచారకుండనై యుండు లాగునని; నా పేరీ ప్రపంచమున చిరస్థాయిగా నిలిచియుండు లాగునను నన్ననుగ్రహింపు"మని ప్రార్థింపగ పరమేశ్వరుండు ముదమొంది "భక్తాగ్రణీ! అటులైన నీవు నంది రూపం ధరించి నాకు వాహనమవైయుండు" మని చెప్పి వృషభవాహనుండై కైలాసంబునకు బోయినాడు. ఆ ధర్ముని పేర నీ తీర్థము ధర్మపుష్కరిణియై ప్రకాశించుచున్నది. కావున నీవీ పుణ్యతీర్థము చెంతనే మరికొంత కాలముండుము. తరువాత నాయందైక్యమొందెద" వని చెప్పిన యనంతరమున నదృశ్య మొందాడు.

ఈ ధర్మ పుష్కరిణికే చక్రతీర్థంబని యొక పేరుగలదు. పూర్వము విశ్వావసు గంధర్వుని కుమారుడు దుర్దమ డనువాడు కొందరి స్త్రీలతో గూడి యొక జలాశయంబున వస్త్రములు లేకుండానే జలక్రీడలాడుచున్న సమయంబున వశిష్ట మహామునియు నచటకు పోవుటయు సంభవించింది. మహామునిని చూచిన స్త్రీలు వెంటనే లేచిపోయి బట్టలు ధరించి దూరమున నిలువంబడియుండ దుర్దముడు మాత్రము చలింపక నందే దిగంబరుడయి వికారచేష్టలు గావించుటం జేసి వశిష్ఠ

డాగ్రహించి "ఓయీ! దుర్మదాంధుండ వగు నీవు భూలోకమున రాక్షసుడవై పుట్టు"మని శపించాడు.

దూరమునుండి చూచుచున్న స్త్రీలందరునువచ్చి యతీంద్రుని పాదము లంటి "మహామునీ! మా నాధుండు శాపగ్రస్తుండయిన నింక మా గతేమి! ఆడు వారము వేడుకొనుచుంటిమి. మా మొరాలకించి గంధర్వునకు శాపవిమోచన మార్గం తెలిపింపు"డని ప్రార్థింప నాజటీయు దయ దలంచి "పడుచులారా! మా శాపంబు తిరుగులేనిది కావున నీతండు దానవుండవయి జన్మింపక తప్పదు. కాని కొన్ని సంవత్సరముల కా రాక్షస రూపంబు శ్రీమన్నారాయణమూర్తి చేతి సుదర్శనంబుచే తెగిపోయిన పిమ్మట తిరిగి నిజాకారము నొందగల"డని చెప్పి వారినోదార్చాడు. దుర్దముడును గర్వమణిగి మునీంద్రునకు నమస్కరించి ప్రియురాండ్రతో తన నివాసమునకు తిరిగిపోయాడు.

కొంతకాలమున కాతండు భూలోకంబున భయంకరరాక్షసుడయి యవతరించి లోక కంటకుడయ్యాడు. మాధవుండిచ్చిన యానతి ప్రకారము గాలవ మహాముని యీ ధర్మ పుష్కరిణి ప్రాంతమునందే జపతపంబుల చేసికొనుచు సంచరించుచుండగ దానవాకారము దాల్చిన దుర్దముండరుదెంచి గాలవుని చంప బోయాడు. ఆ సమయంబున గాలవుండు ప్రాణభయమునొంది "హా! శ్రీహరీ!" ఒక్కమారు బిగ్గరగా పిలిచినంతనే విష్ణుచక్రము పరుగు పరుగునవచ్చి రాక్షసుని తల ద్రుంచివేసింది. అంతటితో శాపవిముక్తి పొంది నిజరూపము ధరించిన చక్రపాణి సుదర్శనముతో "నీవీ దినమునుంచి యీ ధర్మపుష్కరిణి యందే నిలిచి యుండుము. ఇందు స్నానమొనరించి నా భక్తులచే దుష్టులేనియు బాధించు నెడల నా యానతి లేకయే నీవు వారిని వధింపుము. ఇకనుండి యీ తీర్థము చక్రతీర్థ మనియు చెప్పబడుగాక యని పలికి యంతర్ధానమయ్యాడు.

## గంధమాధవ పర్వతము

నాయనలారా! గంధమాదవ పర్వతము సేతువు ననుసరించి సముద్రము లోనికి చొచ్చుకొనిపోయి యున్నది. ఆ కొండ నెక్కగలిగినవారికి బ్రహ్మహత్యా దోషములు సైతము హరించుటయేగాక బ్రహ్మలోకమునకు మార్గము దొరుకుట యందు సందేహము లేదని పౌరాణికులు చెప్పుచున్నారు. అందు వెంచేసియున్న గౌరీసమేత మహాదేవుని లక్ష్మీనారాయణులు, సరస్వతీ బ్రహ్మ, శచీ దేవేంద్రులు సమస్త మునిబృందారకులు సేవించి ధన్యులైనారు. ఆ పర్వతము మీదనున్న తీర్థము పేరు దలంచినంతనే జన్మ జన్మలలోని పాపములు హరించి పునర్జన్మలేని శాశ్వత కైవల్యము లభించునని మహనీయులు తెలుపుచుండ నింక నా సరోవరంబున స్నానపాన దానములు చేసిన వారెంత పుణ్యవంతులో చెప్పనలవిగాదు.

ఒకప్పుడు దృఢమతి యను శూద్రుండు హిమవత్పర్వత ప్రాంతానికి బోయి మున్యాశ్రమం సందున్న యోగీంద్రులను దర్శించి నమస్కృతులాచరించి యనంతరమున "తపోధనులారా! జన్మచే నేను శూద్రుండనైనను నాకు వేదాధ్యయనం సేయ భ్రాంతి కలదు. నాకు వేదమంత్రముల నుపదేశించి నాచేత యజ్ఞయాగాది క్రతువుల చేయింపు"డని ప్రార్థించాడు. మునులందుల కంగీకరింపక "ఓయీ! నీవిది యడుగరాని కోరిక. వేదం చదువుటకును, వేదవిధుల నాచరింపుటను గూడ నీకధికారం లేదు. కాక నీ యందభిమానం జూపి యీ నిబంధన నతిక్రమించి యే బ్రాహ్మణుండేని నీకధికార మిచ్చెనేని యాతండు నరక మనుభవింపక తప్పదు. కావున నీవు విప్రాదుల కుపచర్యలు చేయుచు జీవింపు"మని హితబోధ చేశారు.

దృఢమతి కామాటలు నచ్చలేదు. దూరంగపోయి పర్ణశాల గట్టి

నానుకొని జలాశయం నిర్మించుకొని పూలవనం పెంచుకొని దేవతార్చనలుసలుపుచు కందమూలాలు దినుచు తపమాచరించు చుండ కొంతకాలం గడిచింది. ఒకనాడు గర్గముని వంశానికి చెందిన సుమతి యను తపస్వి నిజాశ్రమంబునకు రాగ దృఢమతి వాని కతిధి మర్యాద లొనరింప నాతండు సంతసించి దృఢమతికి వేదాధికారం నిచ్చి యజ్ఞముల చేయించు చుండ కొలది దినంబుల కాతడు మరణించాడు.

చనిపోయిన సుమతి నరకములో కొన్ని కల్పంబుల కాలము కష్టముల ననుభవించిన తరువాత భూమిమీద చెట్టుగను - జంతువులుగను జన్మనెత్తి అటు పిమ్మట చండాల శూద్ర వైశ్యులందుదయించిన యనంతరమున బ్రాహ్మణుల యింట బుట్టగలిగాడు. అట్లుజన్మించిన విప్రకుమారుండు చదువరియయ్యు బ్రహ్మ రాక్షసిచే పట్టి పీడింపబడుచుండ నాతని తండ్రి కుమారునికై దిగులొందిపోయి అగస్త్యముని కీయుదంత మంతయు చెప్పుకున్నాడు. అగస్త్యుండును కర్తవ్య మాలోచించి "భూసురోత్తమా! భయపడనవసరములేదు. గంధమాదవ పర్వతం మీదనున్న తీర్థంబున నీ కుమారుని మూడు దినములు స్నానములుచేయింపుము. ఆ తీర్థమందలి మహాత్మ్యకంబున నెట్టి భూత ప్రేత పిశాచముల బాధలైనను తీరి పోవుట యందను మానము లేదు. అతండు సుమతియైన నాడు చేసిన పాపంబులను నశింపగల"వనియు నుపదేశింప నా బ్రాహ్మణుండవ్విధంబున తనకుమారున గంధమాధవ పర్వతమందలి కుండమున స్నానము చేయించి నంతనే విప్ర కుమారున కావేశించియున్న గ్రహపీడ తొలగిపోయింది. పాపములు హరించి నాయి. పూర్వ జన్మ జ్ఞాన ముదయించినదని సదానందయోగి శిష్యులకు వివరించాడు.

# సీతాసరోవర తీర్థము

నాయనలారా! సీతా రామేశ్వరమునందలి పాపనాశనీ తీర్థమున గ్రుంకు విడినవారు సమస్త తీర్థములందలి ప్రభావముతో కూడియున్న సీతా సరోవరము నందు తప్పక పునీతులు కావలయును. రావణుని వధించిన రాముడు సీతను పిలిపించి "జానకీ! నీవింతకాలము పగవాని యింట నుంటివి. నీ శీలమునకంతరాయం కలుగలేదని నీవు రుజువు చేసుకొనవలసి యున్నది. కావున, నీవగ్ని ప్రవేశమై రావలయు"నని శాసించాడు. సీత దానికంగీకరించి యగ్నియందు దుమికి తిరిగి క్షేమముగా వెలుపలకువచ్చి తన పాతివ్రత్య ప్రభావంబు నందరకు తెలియచేసింది. ఆ సమయంబునం సీతాదేవి రూప మీ కుండమున కనబడినందున నీ తీర్థమునకు సీతా సరోవరమను పేరు వచ్చింది.

వింధ్యాద్రి ప్రాంతమున త్రిశరుడనే రాక్షసుడున్నాడు. వాని భార్య మిగుల సౌందర్యవతి. ఆ దంపతులకు సంతానము కలుగని కారణమున భర్తయే భార్యతో "మనకు వంశము నిలుపు పుత్రుడు కావలయును కనుక నీవు శుచి యను మునిని నియోగము చేసికొని సంతాన వంతురాలవు క"మ్మని చెప్పాడు. శుచియు నా యువతి సౌందర్యమునకు ముగ్ధుడయి యామెతో కామభోగములనుభవించాడు. మున్యాశ్రమమునుండి యింటికేతెంచిన యువతికి పురుష సంతానం కలిగింది. త్రిశరుడు సంతోషించి తన కుమారునకు కపాలాభరనుండని నామకరణము చేశాడు.

కపాలాభరనుండు పెరిగి పెద్దవాడయ్యాక వైజయంతీ పట్టణమునకు పాలకుడయి రాజ్య సింహాసనమెక్కాడు. వానికి శేషభద్రముడను వాడు మంత్రి. కపాలాభరనుండు మంత్రితోడను చతురంగ బలంబుల సేకరించుకొని యమరావతి మీదకి దండెత్తిపోయాడు. దేవదానవులకు భయంకరమైన యుద్ధం జరిగింది.

యుద్ధంలో దేవేంద్రుడు పడరానిపాట్లు బడిన తరువాత నెటులనో దానవ రాజేంద్రుని సంహరించాడు. కపాలాభరనుని చంపిన కారణంబున దేవేంద్రునకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. అతడనుభవించుచున్న బాధలు బాధలు కావు. భర్త దుస్థితి చూడలేక శచీదేవి దేవగురువులైన బృహస్పతి భగవానుల వారిని తక్కువగల మునీంద్రులను రావించి వారి కుచిత మర్యాదలు గావించిన పిదప "మహానుభావులారా! రాక్షసుని చంపిన నా పెనిమిటికి బ్రహ్మహత్య కల్గుట కేమి కారణము! కలిగిన యీ దోషము పోవుట కేది మార్గ"మని అడిగింది.

అందులకా మునులు "అమ్మా శచీదేవి! నీ పతిచే చంపబడిన కపాలాభరనుండు రాక్షస వంశమువాడే కాని శుచియను బ్రాహ్మణుని యంశచే జన్మించిన కారణమున దానవునకు బ్రహ్మత్వము సిద్ధించినది. అతనిని వధించిన దేవేంద్రునకు బ్రహ్మహత్యా పాతకము సంభవించినది. ఐనదేదో అయినది. సీతా రామేశ్వరము నందునున్న సీతా సరోవర కుండమున మునిగెనేని యింద్రుని పాపంబులు నిశ్చయంబుగా హరింపగలవు. ఆ తీర్థము నందట్టి ప్రభావమున్నదని చెప్పారు.

బృహస్పతి సందేశము ననుసరించి శచీదేవియు, జయంతుడు మున్నగు వారు దేవేంద్రుని గొనిపోయి సీతా సరోవరంబున ముమ్మారు తలమునుగ స్నానము చేయించినంతనే వానినిచుట్టుకొనియున్న బ్రహ్మహత్యా దోషమంతయు సూర్యరశ్మి తగిలి మంచుచందంబున మాయమైపోయింది. దేవ మునీంద్రులందరు నా తీర్థ ప్రభావంబునకు మహాశ్చర్య చకితులయ్యారు.

## రామకుండ ప్రభావము

నాయనలారా! అగస్త్యముని శిష్యులలోని వాడైన సుతీక్షనుండు రామ కుండమున ప్రతిదినము స్నానమాచరించి ఐదు వేల రామనామ స్మరణము సేయు

చుండ కొంత కాలంబునకు శ్రీరామచంద్రుడు దర్శనమిచ్చి భక్తుడడిగిన చందంబున వానికి అద్వైత జ్ఞానము, పరకాయ ప్రవేశ విద్య. గాలిలోను గగనమందున పయనించు శక్తి అరువది నాలుగు కళలందు పాండిత్యము జంతువులు పక్షులు క్రిమికీటకంబులు భాషించునట్టి భాషాజ్ఞానము మొదలగున వన్నియు ప్రాప్తించు నటుల వర మొసంగెను. కావున రామకుండముతో సమానమైన తీర్థమెందునలేదని చెప్పబడుచున్నది. ఒక గడ్డిపోచ విలువగల వస్తువు దాన మొనరించినను గొప్ప ఫలితము నొందెదరు.

ద్వాపర యుగంబున మహాభారత యుద్ధం జరిగింది, కౌరవ పక్షమున నున్న భీష్ముడు పడిపోయిన తరువాత దుర్యోధనుడు ద్రోణాచార్యుల వారిని సర్వ సైన్యాధిపతిని చేశాడు. కురు సేనల క్రగనాయకత్వం వహించిన ద్రోణుడు సంతోషించి సమరంతో పాండవులమీద విజృంభించాడు. ఆయనధాటికెవరూ నిలువ లేకపోయారు. అపుడు శ్రీకృష్ణుడు మొదలైనవారు గుమిగూడి ద్రోణాచార్యుల వారిని చంపే యుపాయ మాలోచించారు. ఆచార్యులు తన కుమారుడైన అశ్వద్ధామ మరణవార్త వింటే తానింక జీవించి యుండునని యొకప్పుడు శపథం చేసినమాట వారికిపుడు జ్ఞప్తికి వచ్చింది. దానికి తగినట్లె అశ్వద్ధామ యిపుడు తండ్రి కంటెదుట లేకుండ దూరప్రదేశంలో యుద్ధం చేయుచున్నందున నీ కుమారుడు చనిపోయాడని చెప్పి ద్రోణాచార్యులవారిని మోసగింపవచ్చును. ఐతే తన కుమారుడు మరణించాడని యెవరు చెప్పితే గురువుగారు నమ్మగలరనే దొక గడ్డు సమస్య యేర్పడింది.

ధర్మరాజు అబద్ధ మాడడనే ప్రతీతి యొకటుంది కనుక ఆయన నోట వింటే గురుండు తప్పక నమ్మడమే కాకుండ యుద్ధం విరమించి ప్రాయోప

వేశమున చనిపోవడం సిద్ధం. అందువలన అశ్వద్ధామ చనిపోయాడని అని రామకుండమున స్నానము సేయింపుమని తెలుపగ శ్రీకృష్ణుడాది బంధు సమేతంబుగ పాండవులు సేతు రామేశ్వరమునకు పోయి రామకుండమునందు శుచియై వెలుపలకు వచ్చినంతనే మరల గగనవాణి "పాండవాగ్రజా! మహా పవిత్రమైన రామకుండమున మునిగితివి కావున నీ పాపములు హరించినవి. నీవింక పట్టము గట్టుకొను" మనియు పల్కింది. అంత ధర్మరాజు సంతోషముగ హస్తినాపురమునకు తిరిగివచ్చి సామ్రాజ్య పట్టాభిషేకంబు చేసికొనినపుడు దేవతలాకాశమున నుండి పూలవానలు గురిపించారు.

రామకుండము చెంతనున్న రామునిచే ప్రతిష్ఠ చేయబడిన శివలింగము నారాధించిన వారికి తొలగని పాపములు గాని-కలుగని సంపదలుగాని యుండునని వాల్మీకి మొదలైన ఋషులు వంచించియున్నారు. నారదాది మునులు రామకుండ ప్రభావమును గాన మొనరించారు.

## లక్ష్మణకుండ ప్రవేశము

నాయనలారా! లక్ష్మణ కుండము మహా ప్రభావముకలది. దీనిగురించిన యితిహాసమొండు నేనెరుంగుదును. భారత యుద్ధంలో శ్రీకృష్ణుడు పాండవపక్షపాతియని ప్రజలు చెప్పుకొనుచున్నారు. శ్రీకృష్ణునియన్న బలరాముడు. బలరామునకట్టి పక్షపాతము లేదు. కాని తమ్ముని మందలించుటకు ధర్మరాజుకు వచ్చింది. కాని ఆయన నేనబద్ధమాడనని పట్టుపట్టి కూర్చున్నాడు. అప్పుడు శ్రీ కృష్ణుడు మళ్ళీ యుక్తిపన్ని-ఇప్పు డశ్వద్ధామ అనే ఏనుగు చనిపోయింది కనుక

నీవు "అశ్వద్ధామ హతః కుంజరః" అంటే చాలన్నాడు. ధర్మరాజందులకు సరే నని ద్రోణాచార్యులవారు వినబడేలాగా "అశ్వద్ధామ హతః" అనినాక మెల్లగా "కుంజరః" అని "నా సత్యవ్రతం నేను నిలుపుకున్నానుగదా" అని తృప్తిజడ్డాడు. అదిగాక "కుంజరంః" అన్నప్పుడు తక్కినవారు వాద్యాలు గూడ ప్రోగించారు. ఎలాగైతేనేం ద్రోణుడు తన కొడుకు నిజంగానే చనిపోయాడనుకుని తానును మరణించాడు. తరువాత పాండవులకే విజయం లభించింది.

తరువాత ధర్మరాజు పట్టాభిషేకం చేసికొనడానికి అన్ని ప్రయత్నాలు పూర్తయ్యాయి. ఆయన సింహాసనంమీద యెక్కబోవుసమయంలో ఆకాశవాణి- యుధిష్టిరా! నీవు అశ్వద్ధామ బ్రతికియుండగ చనిపోయాడని అబద్ధమాడావు. ఆ మాట విన్నందున పుత్రశోకంతో ద్రోణాచార్యులు చనిపోయాడు. కుట్రపన్నితివి. కావున నీ వసత్యవాదివేగాక గురుద్రోహివి. విప్రద్రోహివి గూడనైతివి. నీయట్టి పాపాత్ము డీ పవిత్రమయిన హస్తినాపుర సింహాసన మెక్కరా" దని అందరూ వినేలాగ పలికింది. ఆ మాటలు విని ధర్మనందనుండు సిగ్గుపడి తలవంచు కున్నాడు. దౌమ్యాది మునులుగూడ గగనవాణి మాటలు కాదనలేక పోయారు.

నారదాది మునులంతా యోచించి శ్రీకృష్ణునితో "వాసుదేవా! సేతు రామేశ్వరము నందు రామకుండ మున్నది కద! అందు మునిగిన వారికి బ్రహ్మహత్యాది దోషములు హరించును కావున ముందీ యుధిష్టిరునిచే చేయించుట వాని మతము కానందున యుద్ధసమయంలో తాను తీర్ధయాత్రలకు పోవుట మంచిదను కొన్నాడు.

ద్వారకా నగరమునుండి బయలుదేరిన బలరామ ప్రభువు ముందుగ ప్రభాస తీర్థమున పితృదేవతలకు తర్పణలువొదలిన తరువాత మరికొన్ని క్షేత్రాలను దర్శించుచు కొలదిదినములో నైమిశారణ్యంబునే మునులందరు సేయుచున్న

యజ్ఞశాలకు బోయాడు. బలరాముని చూచినంతనే మునులందరును లేచి నమస్కరించుచు ప్రతి నమస్కారముల నందుకొనుచు కుశల ప్రశ్నల జేయుచున్నను సూతమహర్షి నిర్లక్ష్యమున కూర్చొని యున్నందున బలరాము డాగ్రహించి దర్భతో వానితలపై కొట్టాడు. వెంటనే సూతముని తలపగిలి చనిపోయాడు.

మునులంతట "యాదవరాజా! నీవాదిశేషావతార మూర్తివని జగంబున కొనియాడుచున్నవి. ఐనను నిరంతరము పరమేశ్వరుని లీలలనే ప్రవచించుచు మహాపుణ్యశాలియైయున్న సూతుని చంపుట మంచిదికాదు. నీకు ముని హత్యాపాతకంబు ప్రాప్తించుటకు సందియంబులేదు. కావున నీవు నీ సంఘర్షణ మాయా ప్రభావంబున వీనిని బ్రతికించి మునిహత్యాపాతకంగాని-దుష్కీర్తిగాని పొందక నుండు"మని పలుక నా ద్వారకానాథుండు సంతసించి సూతుని తిరిగి బ్రతికించాడు. పునర్జీవితుండయిన సూతుండును—మిగిలిన మునులు బలరాముని గౌరవించారు.

అదియునుగాక వల్కలుండను రాక్షసుడు బలవంతుడై యీ మునులు లాచరించుచున్న యజ్ఞముల నన్నింటిని భంగ మొనరించుచుండెననియు, మునులను హింసించుచుండెననియు, ముని పత్నులను చెరబట్టుచుండె ననియు వారల వలన నాలకించిన బలరాము డాగ్రహించి యీ దానవుని సంహరించాడు. అటు మీదట మునుల నుండి వీడ్కోలు పొందిన రోహిణి కుమారుడు తీర్థయాత్రలు గావించుకొని తిరిగి నిజపురంబున కేగుచుండ గగనవాణి బిగ్గరగా "వాసుదేవా సూతుని బ్రతికించినంత మాత్రమున నీ దోషం సంపూర్ణముగ హరింపలేదు పాపంబుల గొన్నింటిని మిగిలించుకొని యింటికిపోవుట మంచిదిగా"దని పలికింది

బలరాము డంతట తిరిగి నైమిశారణ్యమున కుంబోయి తానాలకించిన పల్కుల నా మునులకు వినిపించి "నేను పరిపూర్ణముగ పాతకంబుల బాయుటకేమి

చేయవలయు" ననగ సూతమునీంద్రాదులు "బలరామా! నీవు గంధమాధవ పర్వతము నందున్న లక్ష్మణ కుండమున స్నాన మొనరించినచో నీ సంకల్పము నెరవేరగల"దని చెప్పారు. వారి మాటల ప్రకారంబున కృష్ణాగ్రజుండు సేతు రామేశ్వరమునకు బోయి గంధమాధవ పర్వతము నెక్కి లక్ష్మణ కుండమున స్నానం బొనరించి సంపూర్ణముగ పాపరహితుడై ద్వారకకు పోయి సుఖసౌఖ్యము లనుభవించాడు.

## హనుమత్కుండ ప్రభావము

నాయనలారా! శ్రీరాముడు లంకనుండి తిరిగి యయోధ్యకు బోవ సేతువు దాటినంతనే కంటిచూపు కనపడకపోయింది. కారణము లేని కారణంగా దృష్టి హరించిపోవుట కేమి కారణంబన యడుగగ నలనీలాచార్యాదులు "రాఘవా! బ్రాహ్మణుండైన రావణుని వారి వంశము నంత మొందించితివి. బ్రహ్మహత్యా పాతకంబున నీ చూపు స్పష్టమైనది. ఐనను చింతింప బనిలేదు. ఇచట గంధమాధవ పర్వతం మీద శివప్రతిష్ట చేయుము. కోల్పోయిన నేత్రదృష్టిని మరల యథావిధిగ పొందగల"వని కర్తవ్యము నుపదేశించారు.

నలనీలాదులు మాటలందు రామునకు నమ్మకమున్నది. కావున యోచింపక వెంటనే శివప్రతిష్ట జేయ నిశ్చయించుకొని జ్యేష్ట శుద్ధ దశమీ బుధవారం హస్తా నక్షత్రంబున ప్రతిష్ట చేయుటకు శుభలగ్నము నిశ్చయించిన తరువాత హనుమంతుని పిలిచి "వత్సా! మనకిపుడు శివలింగము కావలయునుగదా! నీవిదే కైలాసంబునకు బోయి పార్వతీ పరమేశ్వరుల నడిగి శ్రేష్టమైన లింగమును గొని తెమ్మ"ని నియోగించినందున అంజనీ తనయుండు వాయువేగంబున కైలా

సంబునకుపోయి గౌరీశంకరుల కీయుదంతమంతయు నెరింగించి వారి వలన లింగమును గైకొని తిరిగి రా పయనంబగునప్పటికి కొంతకాలమైనది.

గంధమాధవ పర్వతంమీద రాముడు మొదలయిన వారాంజనేయుని రాక కెదురు చూచుచున్నారు. కాని హనుమంతుని జాడలేదు. నిర్ణయించిన లగ్నం మించిపోవుచున్నది. ఏమిచేయుటకు తోచక రాముడు మదనపడుచుండగ సీత యిసుకతో నొక లింగమును చేసియిచ్చింది. గత్యంతరములేక దాశరధి సీత చేసి యిచ్చిన సైకతలింగమునే నిర్ణీత స్థానమునందు శుభముహూర్తము మించ కుండగ వేదమంత్రములతో ప్రతిష్ఠ చేశాడు. ప్రతిష్ఠానంతరం జరుపవలసిన క్రియలు పూజలు క్రమము ననుసరించి జరుపబడుచున్నవి.

అంతలో కైలాసంనుండి శివుడిచ్చిన లింగముతోడ హనుమంతుడు తిరిగి వచ్చాడు. అప్పటికే ప్రతిష్ఠ జరిగినందున హనుమంతుడు చాలబాధపడ్డాడు. పొంగి పొంగి వచ్చే దుఃఖాన్ని నిలుపుకోలేకపోయాడు. నేనింత కష్టపడినందుకు ప్రయోజనమేమిటి? ఇప్పుడీ లింగమును తెచ్చి యేమిచేయవలయునని వాపో యాడు. కొంతవరకు రాముని నిష్ఠూరం లాడారుకూడ. నిజానికి రాముడు గాని, లక్ష్మణుడుగాని, సీతగాని, విభీషణుడుగాని, నలనీలులుగాని, సుగ్రీంవాంగద జాంబ వంత సుషేణాదులుగాని మాటాడలేకపోయారు.

శ్రీరాముడే ఆంజనేయుని కౌగలించుకుని "వత్సా! హనుమా! నీవు నాకాత్మీయుండవు. నా తమ్ములలో నొక్కండవని నేనింతకు ముందే చెప్పియుం టిని. నాయీ నేటి విజయానికి నీవు కారకుండ వనుటయు సత్యము. నీ యందు నాకేనాడును భేదాభిప్రాయముండదు. కాని నీవు కైలాసమునుండి లగ్నకాలము నకు రాలేకపోతివి. ముహూర్తము మించరానిదయినది. కావున నీవిపు డింకొక పనిచేయుము. నేను ప్రతిష్ఠించిన ఈ రామలింగేశ్వర లింగమునకు సమీపముందే నీవీ లింగమును ప్రతిష్ఠచేయుము. నీచే ప్రతిష్ఠ చేయబడిన ఈ లింగము హనుమ

లింగమని ప్రఖ్యాతి నొందగలదు. అదియునుగాక నేను స్థాపించినది యిసుక లింగమేకాని నీవు స్థాపించినది సాక్షాత్పరమేశ్వరు డిచ్చిన లింగముగదా! ఇంక నీకీ విచారమెందుల" కని సమాధానం చెప్పాడు.

రామ సందేశము కాదనక ఆంజనేయుండు రామలింగేశ్వర లింగమునకు ఉత్తర భాగంబున తాను తీసుకొని వచ్చిన శివలింగమును ప్రతిష్ఠించి పూజించాడు. మనమీనాటికిని గంధమాధవ పర్వతంబుమీద నాయా లింగములను గాంచి సేవించి కృతార్థులము కానవకాశములున్నవి. ప్రతిష్ఠకుముం దాంజనేయుడు శోకించుచు భూమిమీదపడి దొరలినచోట నొక గుంట పడింది. అంతట గంగాజలమాగర్తమునందు నిండినవి. దానికి హనుమత్కుండమని పేరు కలిగింది. ఆ కుండమున స్నానము చేసినవారికి పంచ మహాపాపములు దొలంగుట యందెటువంటి సందేహంలేదు. మరియు వారికి భూతప్రేత పిశాచభయములుండవు. దారిద్ర్యము సంభవింపదు.

## యాత్రా పరిసమాప్తము

నాయనలారా! ఇట్లే కాశీరామేశ్వర యాత్రకు సంబంధించిన సకల తీర్థములు, సకల క్షేత్రములు, సకల దేవతామూర్తుల దర్శింపవలయునన్నను అయా యితిహాసంబుల వివరింపవలసియున్నను బ్రహ్మేంద్రులకైనను సాధ్యంగాని పనియని నేనింతకు ముందే చెప్పియుంటిని. ఇంతకు మనం చూడదగినవనియు — విడువదగినవియు — సేవింపదగినవియు ననేకంబులు మిగిలియున్నవి.

ఈ సేతురామేశ్వరమందును భేతాళ వరదతీర్థం, మంగళతీర్థం,అమృతవాసి తీర్థం, బ్రహ్మకుండము, అగస్త్య తీర్థం, జటాతీర్థం, లక్ష్మణతీర్థం, శివతీర్థం, శంఖతీర్థం, కోటతీర్థం, ధనుష్కోటి తీర్థంలు మొదలయిన వెన్నియోకలవు. అవిగాక రామసైన్యమున నున్న వారందరి పేరుల ననుసరించిన నలతీర్థం, నీలతీర్థం, సుగ్రీవతీర్థం, గవక్షయ తీర్థం, గజతీర్థం, శరభతీర్థములు మొదలయినవి గూడ పెక్కులున్నవి.

మనిమిప్పటికి చూచిన ఈ క్షేత్రములు చాలును. ఈ సేతురామేశ్వరంబున ముఖ్యముగ చేయదగిన పనులను మాత్రం పూర్తిచేసుకొని తిరిగి కాశీకి పోవుదము లెం"డని శిష్యజన సమేతంముగ తిరిగి ప్రయాణమై పుణ్యతీర్థములలో స్నానములు చేసి మోములందు బొట్లుధరించి గంధవమాధవ పర్వతమునందలి రామేశ్వర లింగము హనుమల్లింగము మొదలైన దివ్యలింగమూర్తుల నారాధించి యధా శక్తినందున్న బ్రాహ్మణులకు యాచకులకు దానంబు లొనరించిన యనంతరమున నాటికి వారందరును విశ్రాంతి తీసుకున్నారు.

ఇవ్విధంబున కాశీరామేశ్వర యాత్ర ముగించుకొనిన సదానంద యోగి మరుదినంబున శిష్యజనంబుల వెంటనుంచుకొని వెనుకకు మరలి ప్రయాణము సేయుచు మునుపు నివసించిన చోటులలో గాక క్రొత్త దృశ్యంబుల చూచుచూ అందందుగల మహామునుల సందర్శించుచు కాశీపురంబునకు చేరి అన్నపూర్ణ విశ్వనాథ స్వాములకు నమస్కరించి తరువాత నిజాశ్రమంబు చేరుకున్నారు.

కథ కంచికి—మన మింటికి

ముద్రణ : 'దుర్గా భవాని' విజయవాడ—3